

Respectfully dedicated

to

**Mr. & Mrs. Rayasam Venkatasivudu.**



# సంపాదకీయ భూమిక



ఈగ్రంథమాల స్థాపింపఁబడి యిప్పటికి 18 మాసములైనది. 1924 సం॥ లో నాలుగు గ్రంథములును నొక అనుబంధగ్రంథమున్ను ప్రచురింపఁబడినవి 1925 సంవత్సరమున ప్రహ్లాద ప్రథమపుష్పముగను ఆనందమయి (ప్రథమభాగము) రెండవ పుష్పముగను ప్రచురింపఁబడినవి—

ఈగ్రంథమాల యిప్పుడెనిమిది వందలమంది చందాదారులతోడను కొందరుదారసాహసులగు పోషకులతోడను ఒప్పుచున్నయది. వీరందరును తగుసాహాయ్య మొనర్చుచుండుటచేతనే గ్రంథమాల యింత యభివృద్ధి నచిరకాలముననే బొందినది—

మా గ్రంథమాలాభిమానులందరును దీనియందెల్లపు డభిమానమును జూపుచున్న దీనికెట్టి కొరఁతయు నుండదు ఇదివరకు చందాలు పంపించని వారందరును తామీయవలసిన విత్తమును వెంటనే బంపించి సాహాయ్య మొనర్ప బ్రార్థితులు—

ఈకాలము నవలాయుగముగాన నవలలనే (అపరాధపరిశోధక, చారిత్రిక, సాంఘిక) ప్రచురింప నమకట్టితిని. కాఁబట్టి గ్రంథమాలయం దిదివరలో లోపములేవైన నున్న మన్నించి నూతనమార్గంబులఁ జూపఁ బ్రార్థితులు—

గ్రంథకర్తలు, నూతనపద్ధతిని గ్రంథముల రచియించి మాకొసంగ బ్రార్థితులు.—ఇదివరలో గ్రంథమాలయం దెక్కుడభిమా

పదును జూపుచు మాకు గ్రంథముల నొసంగిన శ్రీయుత పామర్తి సూర్యప్రకాశశర్మగారు, శ్రీయుత భట్టిప్రోలు సత్యానంద కవిగారు, శ్రీయుత పెన్మెత్స సత్యనారాయణరాజగారు, శ్రీయుత వెలగల సుబ్బారెడ్డిగారు, శ్రీయుత పోతూరి రామచంద్రరావుగారు, కడు వందనీయులు.

ఇట్లు

కాకరపర్తి సత్యనారాయణ,

సంపాదకుడు.



# మహారాజపోషకులు.



మ॥ రా॥ రా॥ శ్రీ శ్రీ కర్రి చినవెంకటరెడ్డిగారు, రంగూన్ పూల్ కంట్రాక్టర్, ప్రొప్రైటరు ఆంధ్ర మెచ్ వర్క్సు, మారుటేరు.

,, శ్రీ శ్రీ సత్తి వెంకయ్యగారి కుమాళ్లు కామిరెడ్డిగారు, మారుటేరు.



# రాజపోషకులు.



1 శ్రీ శ్రీ సత్యవోలు గున్నేశ్వరరావుసోదరులు, ల్యాండులార్డ్సు, రాజమండ్రి.

2 శ్రీ శ్రీ జంపన సుబ్బరాజుగారు, ప్రొప్రైటర్, చినఎండ్రికొలను, ఖండవల్లి.

3 శ్రీమత్ తిరుమల వెంకటశ్రీనివాసాచార్లు అయ్యవార్లంగారు, సీనియర్ ప్రొప్రైటర్, పెంటపాడు.

4 శ్రీమత్ కిలాంబి వెంకటశ్రీనివాసవరదాచార్లు అయ్యవార్లంగారు, సీనియర్ ప్రొప్రైటర్, లింగాలఅగ్రహారం. పెంటపాడు.

5 శ్రీమత్ యం. యస్. అవతారంగారు, ల్యాండులార్డు, పెంటపాడు.

6 శ్రీ శ్రీ కామర్సు రామచంద్రరావుగారు, ల్యాండులార్డు, దువ్వ.

7 శ్రీ శ్రీ భూపతిరాజు సీతారామచంద్రరాజుగారు, ల్యాండులార్డు, సిద్ధాంతం.

8 శ్రీ శ్రీ పెనుమెత్స సీతారామరాజుగారు, ల్యాండులార్డు, అజ్జరం.

9 శ్రీ శ్రీ గొడవర్తి నాగేశ్వరరావుగారు, ల్యాండులార్డు, ఆచంట.

10 శ్రీ శ్రీ భారతం సూర్యనారాయణగారు, ఎల్. యం. పి.
ఖండవల్లి.

11 శ్రీ శ్రీ ఆణిమిళ్ళ చినవెంకటశాస్త్రిగారు, ల్యాండులార్డు,
శాకరపర్రు

12 శ్రీ శ్రీ కోనాల బ్రహ్మన్నగారు, ల్యాండులార్డు, పెనుగొండ.

13 శ్రీ శ్రీ కొమ్ము కిరిటిగారు, ఏలూరు.



# పోషకులు



1 శ్రీ శ్రీ కండిమల్ల సీతారామ బహద్దర్ గారు, జమీందారు ఆఫ్
గన్నవరం, నూజవీడు.

2 ,, మోతే నారాయణరావుగారు, }
3 ,, మోతే నరసింహారావుగారు, } చిన్నన్నపేట కండేవల్లి
4 ,, మోతే కృష్ణారావుగారు, } జమీందార్లు, ఏలూరు

5 ,, గుడిమెట్ల వీరారెడ్డిగారు, మర్చెంటు, మార్టేరు.

6 ,, గుత్తా వెంకయ్యచౌదరిగారు మేనేజింగ్ ప్రొప్రైటరు
శ్రీపాండురంగసినిమా, ఏలూరు.

7 ,, పాలకుర్తి శివరావుగారు, హెడ్ క్లార్కు I. F. Office
మసూలా

8 ,, డాక్టరు కోకా అహోబలరావుగారు మసూలా.

9 ,, ఇనుగంటి రాజగోపాలరావుగారు, నూజవీడు.

10 ,, చింతా చినసోమరెడ్డిగారు, ల్యాండ్‌లార్డు, మార్టేరు.

11 ,, జవ్వాది వెంకయ్యగారికుమారుడు లక్ష్మయ్యగారు, పెనుగొండ

12 , తాడిమేటి విశ్వనాథంగారు, డాక్టర్, పెనుగొండ.

13 ,, సి. హెచ్. వెంకటసుబ్బారెడ్డిగారు, మార్టేరు.

14 ,, కొండా నారాయణమూర్తిగారు, డాక్టరు, మారుటేరు.

15 ,, మునమర్తి శోభనాద్రిగారు, మర్చంటు, ఆచంట.

16 ,, చిర్ల సుబ్బిరెడ్డిగారు, మునసబు, మార్టేరు.

17 ,, కూనెం కృష్ణమూర్తిగారు, పెనుగొండ.

18 ,, పెన్మెత్స రాజగోపాలరాజుగారు, ల్యాండ్ లార్డు, అజ్జరం.

19 ,, తురగా వెంకట్రామయ్యగారు, ల్యాండ్ లార్డు, పిట్టలవేమవరం

20 ,, యర్రా చినరామయ్యగారి కుమారుడు వీరరాఘవరావుగారు, ల్యాండులార్డు, ఉప్పులూరు.

21 ,, కలిదిండి వెంకట్రామరాజుగారు, ల్యాండులార్డు, శింగవృక్షం

22 ,, కొచ్చెర్లకోట వెంకట్రాయుడుగారు, ల్యాండులార్డు, కలవలపల్లి,

23 ,, చుండూరి పానకాలరావుగారు, మర్చంటు, పాలకొల్లు

24 ,, చుండూరి నారాయణరావు బ్రదర్సు వారు మర్చంట్సు పాలకొల్లు.

25 ,, మేడూరి సూర్యవర్ధనంగారు, మండపాక.

26 ,, వి వి. నారాయణమూర్తిగారు, సిద్ధాంతం

27 ,, యం. సూర్యప్రకాశరావుగారు, రివిన్యూ ఇన్స్పెక్టరు, ఖండవల్లి

28 ,, గోర్తి సుబ్బారాయుడుగారు. రాజమండ్రి

29 ,, లక్కరాజు సూర్యప్రకాశరావుగారు, భట్టిప్రోలు

30 ,, కాకరపర్తి సుబ్బారావుగారు, కమీషన్ ఏజంటు, తిపర్రు

## సహాయులు.

1 భోగవల్లి సీతన్నగారు, తిపర్రు

2 బసవ సూరన్నగారు, పెరవలి

3 టి. జి. బంగారుస్వామిసెట్టిగారు రాజమండ్రి

# విషయసూచిక.









ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# ఆనందమఠము.

## ద్వితీయభాగము.



### 1 వ ప్రకరణము.

కార్యమేమి?

తెల్లవారిన పిదప గణేశుఁడు భవానీశంకరులకు తాను కమలాకరుని చూడఁబోవుచుంటినని వర్తమానమంపి తాఁ బోయెను. ఆవార్త వచ్చినప్పటినుండియు వారిద్దఱును తరువాత నేమిజరుగఁబోవునో, కమలాకరుఁడేమి చెప్పునోయని మొగములుచూచుచుండిరి. కాని ఆనంద కమలాకరుని కార్యముఁగాంచి యాతఁడొకపూటలో నేరమునంగియు వట్టివిగ చేసివైచునని పూర్ణముగ నమ్మియుండెను. ప్రతినిమేషము నొక యుగమునలె లెక్కించుకొనుచు వారు వేచియుండిరి. ఎనిమిది, తొమ్మిది, పదిగంటలుకూడ గతించిపోయెను. గణేశునిజాడ మాత్రము లేదు. పదిరెండుగంటలవరకు చూచిన నాతఁడు రాకపోవుటచే వారికి విపరీతాలోచనలు తోఁచసాగెను. ఎల్లరు వివిధములను యోగ్యు పెక్కురీతులుగ చెప్పుకొనుచుండిరి. వారింతవరకు భోజనమైన చేయలేదు.

పదిరెండున్నర గంటలయ్యెను. ముసలిరాఘవుఁడు రోజుకొనుచు పరుగెత్తి వచ్చి "వారు వచ్చుచున్నా"రని కేకవేసెను. అందరును కుమారుగ వీధిలోనికిపోయిరి. గణేశరమేశనురేంద్రులు మువ్వురు

నౌకరుమూరుగ లోనం బ్రవేశించిరి. గణేశుఁడు ప్రశ్నింపఁబడి "పండే" యని ప్రత్యుత్తరమిచ్చెను. వారికందరకును ధైర్యము చిక్కెను. లోని కేగఁగనే "స్త్రీలందరును బైటకు పోఁగోరెదను. రహస్యములు మాటలాడవలసియున్నది" యనెను. స్త్రీలుపోవగనే మగవారందరును మాటలాడు కొనఁదొడంగిరి.

పూసగ్రుచ్చినట్లంతయు నాసుప్రసిద్ధ న్యాయవాది కమలాకరుఁడు తనతో చెప్పినట్లు చెప్పివేసెను. ఇదివినినంతనే వారెల్లరాశ్చర్యమగ్నులైరి.

"ఇది నమ్ముటకు వీలులే"దని సురేంద్రుఁడు పల్కెను.

"నేను మొదటనే స్త్రీయెవతెయో దీనికి కారణము లుండు నని యనుమానించితి"నని రవీంద్రుఁడనెను.

"నేను నట్లె యెంచితిని. కాని మీరెల్లరు నామాటలను త్రోసి పుచ్చితి"రని గణేశుఁడు పల్కెను.

"ఇఁక ముందు చేయఁదగ్గదేది" యని భవానిశంకరుఁడడిగెను.

గణేశుఁడెంతటి యాలోచనాపరుఁడో రవీంద్రుఁడు నంతటివాఁడె. గణేశుఁడు "ఇదియంతయు మనకు సమంజసముగ తోఁచవచ్చును. కాని, లోకులకట్లుకనఁబడదు. ఇదివరలో మీరు, పురవాసులు, నేనును కూడ మనోరమ నిష్కల్మషయనియు పూతచరిత్రయనియు నమ్మియుండిన వారమే. మనకే దీనిని నమ్ముటకు వీలు లేదనితోఁచుచుండగా నింక నెవ్వరు నమ్మగలరు? అంతియకాక ఈసంగతి నేవిధముగ నాధారముగ గొని యాతని నిర్దోషిత్వమును స్థాపింపనగును? దీనికి నిదర్శనము లేవి? కమలాకరుఁడు చెప్పినట్లుగ దీనికొక దృష్టాంతమైన లేదే? ఇదికోర్టులో ధృవపరచుటయెట్లు? కోర్టువారు మనమాటలను పాటించి యొకవేళ మనోరమను పిలిపింతురనుకొందము. ఆమె యిదివరకే తెలియనిదాని వలె నటించుచున్నది. అదియుగాక దీనిని స్థాపించుటకు వీలు లేకుండు

నట్లు తగిన జాగ్రత్తను తీసికొనియున్నది. ఇపుడామెను. పిలువఁబంచి యడిగినచో నిర్భయముగ, నిశ్చలముగ. "ఈతఁడు తనపగఁదీర్చికొనుటకై నానాధునిఁజంపయత్నించి విఫలుఁడగుటచే నిఁక రానున్న యపయశము రాక మానదు. ఊరకుండ నేల యని, విరోధిభార్యనగు నన్ను నిందాస్పదురాలుగ జేయఁ జూచుచున్నాఁడు. నాచరిత్రమంతయు మీకు తెలిసియేయున్నది కదా?" యని యచటివారిముందు పల్కెను. అందులకందరును "సత్యము. ఈమె నిష్కల్మష ; కమలాకరుఁడు పరమ ఛండాలుఁడు, ద్రోహి. అసత్యప్రలాపి, యనియందురుగదా! దీనివలన నితనికి యొగ్గుగలుగును గాని లాభముకలుగఁజాలదు. "ప్రజావాక్యంచ కర్తవ్యమ్" అనునీతి పంచాయతిదార్లును న్యాయాధిపతియు గూడ నట్లే యందురు. దీనిమూలముగ నీతనికి పులిమీద పుట్రయనునట్లు నేరము బలమగును. ఇఁక వీనికి ద్వీపాంతరవాసమో, యురిశిక్షయో తప్పదు కనుక నీవిషయమున నేమియు చేయఁజాలనని తలంచెదను." అనెను.

"నిమిగణేశా! ఇట్లు పల్కెదవు? నీవువాదింపవలెనన్నచో నీనేరమనఁగనెంత! ఇదివరలో నింతకంటె కష్టమగునేరములను బట్టలేదా? సరిగ నాలోచింపుము. అదియుఁగాక నిప్పుపట్టిన నేరము పోవుట యనునెట్టిది? ఇదివరలో నెన్నిమార్లు నీవుచేపట్టితివన్నంతమాత్రమున న్యాయాధీశుఁడు నీకనుకూలముగ తీర్పునియలేదు? నివనిన యెంతటి న్యాయాధిపతియు లోబడకుండునా?" యని రమేశుఁడు పల్కెను.

"నిజమే. కాని నాపానసునకు పూర్ణముగ నిది ఫలించునని తోచనిదియు, తగినంత సత్యములేనిదియు,నిదర్శనములు మెండుగలేనిదియునగు కేసులను పట్టలేదు. ఒకవేళ స్నేహమును పాటించి వాకిష్టములేని నేరము పట్టినను, నేను వాదింపఁజాలకపోవుటయేగాక, నయ్యది నిష్ఫలమగును. అంత మాయశమునకు చెఱుపును, కమలాకరునకు నష్టమును గలిగితిరును." అని గణేశుఁడు మారుపల్కెను.

"పోనీ! నీవు వాదింపకున్నను నీతికిసాహాయ్యమునుండి విముఖుఁడవుగాకుము. ఇదివరకు నీవీతని పక్షమున పనిసేయబూనితి వని వంతమాత్రమున పాటలీపురవాస్తవ్యులెల్లరును కమకలాకరునకు మేలుగలుగునని తలంచుచుండిరి. ఇప్పుడు నీవువిడచివేసినచో కమలాకరుఁడు నేరస్థుఁడనియు, నాకారణముననే పరమపవిత్రుఁడవగు నీవు సైతము నీతిని వదలివైచితివనియు తలంపకమానరు. కనుక నీతినుండి వీడిపోవకుము"

"సరియే. ఇఁక నన్నేమిచేయుమనెదవు? ఇఁక పనిచేయువారెవ్వరు.

"ఎవరననేల రవీంద్రుఁడే. మీరీకరణి నెంత చెప్పినను రవీంద్రుఁడు పలుకకున్నవాఁడు. చూడలేదా? అతనికేదియో తోఁచియుండవలెను. ఏమి? రవీంద్రా! పలుకవు? నీయభిప్రాయమేమి?"

రవీంద్రుఁడు వీరిమాటలనెల్ల వినుచున్నను తనమనసునం దేదియో స్థిరపరచుకొనియుండెను. కాని తన్నడిగినప్పుడుగాని మాటాడుటకాతఁడు సిద్ధపడలేదు. ఇపుడాతనియభిప్రాయము నడిగినంతనే యాతఁడు లేచినిలువబడెను దేహమునుసడలించెను. గంభీరనాదముతో నాతఁడు "మిత్రులారా! మీరందరును తలంచినట్లు నన్ను పెద్దగాఁజేసి యడుగుచున్న వారలగుటచేత, నాయభిప్రాయము వేరుగనున్నదని చెప్పసాహసింపుచున్నాను. మాన్యుఁడగు గణేశచంద్రుఁడు చెప్పినదంతయు సమంజసముగనే తోఁచుచున్నను నాకొకించుక వేరుగఁదోఁచుచున్నది. అది చెప్పబోవుచున్నాను. మీరెల్లరును సావధానచిత్తులరై విందురుగాక!"

"నేను మొట్టమొదట కమలాకరుని చూడవలసియున్నది. అతఁడే నేనేమిచేయవలసియున్నదియు నిశ్చయించునుగాక! కాని నామనస్సునందొకరీతిగ నేను చేయవలసిన కార్యమును నిశ్చయపరచుకొనియే యున్నాను. నేను మొదటినుండియు కమలాకరరాయలందు

నమ్మకము గల్గియేయుంటిని పూతచరిత్రయగు నానందను వరించిన యాతఁడు సాధారణమానవుఁడై యుండఁజాలఁడనియు, నట్టివాఁ డక్రమముగ ధనపురేశుని బంపునంతటిద్రోహియై యుండఁజాలఁడనియు నాకు మొదటినుండియు తోఁచుచుండెను. ఇపుడు నేను చేయునదేదియో చెప్పెదగాక! నేను కమలాకరుఁడు నిర్దోషియని ఋజువుచేయుదును. అదిసాధ్యమగునా? సాధ్యమగుననియే నాతలంపు. అతఁడు వారిరువురి సంబంధమును గూర్చిననిదర్శనములన్నియు నశించినవని తలచుచున్నాఁడు. అది తప్పు. తప్పక కొన్ని కాకున్న కొన్నియైననుండి తీరును. అది యాతనికి తెలియకపోవచ్చును. అతఁడు వారిరువురును తగిన జాగ్రత్తను తీసికొంటిరని తలంచుచున్నాఁడు. కాని యట్టివారల రహస్యములే బయలగుచుండెను. సర్వసాధారణముగ మనము దాగుకొనఁ దలంచునపుడే మనము కనుఁగొనఁబడుచున్నాము."

"నన్నీకార్యమునకు నియోగించినచో నిప్పటినుండియే తగిన పనిచేయుదును. మనకు ధనమున్నది. పలుకుబడికలదు. మనస్థితినిబట్టి చూచినచో మనకనేకులు సాహాయ్యముచేసితీరుదురు. రేపుసాయంకాలములోపుగ తగువారలను నియమించి "ఆచూకీ" తీయుదును. నేనిదివరకనేకమారులు కమలాకరుని గృహముండిన వీథిని చూచియున్నాను. అది నిజముగ నిర్జనప్రదేశమే. కాని అందునుగూడ బీదలు నివసించుచున్నారు. వీరెంతటి జాగరూకతతో నివసించుచున్నను, వారిలో నొకఁడు గాకున్న నొక్కఁడైన వీరిని చూచియుండును. నేను నియమించినవారలీసంగతుల నారయుదురు. వారిపేర్లుచెప్పుట యనవసరము ఎవనెరో గూఢముగ నింగువర్తించు స్త్రీయని మేము చెప్పుదుము గానివలన కొంతసంగతి బైటపడును. ఆబంగాళాను పరీక్షింతురు ఉ ద్రోక్కళావై . దర్శనముండక మానదు; ఇదిమొదటిపని."

ఈతఁడు గృహము నవనిపేరు పెట్టికొనెనో యాతఁడు జీవించి యుండెనా యనుసంగతి పరదేశములలో నారయవలెను. అతఁడుండినచో వాతఁడొక నిదర్శనము.

"ఇఁక మూఁడవ దెద్దియన: వీరికి పరిచారికగనుండిన సీతనరయుట, ఆమె యెచటనుండినను కనుఁగొని రప్పింతుము. వీరికి తెలియకుండిన నామెకు వీరిపేరు తెలిసియే యుండవచ్చును అధమపక్షము, మనోరమముఖము నైన నామె చూచియుండును. అందు ముఖ్యముగ స్త్రీలు, వారిలో పూలనమ్మువడఁతులు, పరిచారికలు, చాల తెలివి తేటలు గలిగి వర్తింతురు. వారికి తెలియని సంగతులుండవు. మన మనేక పుస్తకములందు పరిచారికలును, పుష్పలావికలును, రాజాస్థానములందలి భటులును, రహస్యములు వెల్లడింతురని చదివియుంటిమి కదా? ఈమెయు వారివలెనే యుండఁగూడదా? ఈమెను కనుఁగొన్నచో ప్రబలమగు సాక్ష్యము దొరకును.

"అదియుఁగాక, వీరలచట నివసించుకాలమున వీరియుపయోగార్థమై పాలుదెచ్చువారు, తోటమాలీలు మొదలగువారు మనకీవిషయమున తగుసాహాయ్యము చేయగల్గియుందురు." అనుటయు,

ఆహా! తెలివియన నిట్టులుండవలెనని సురేంద్రుఁడు ప్రశంసించెను. తక్కిన వారెల్ల నీతని మాటలతోడ చకితగాత్రులైరి. నారీభావము లెట్లున్నను సరకుచేయక రవీంద్రుఁడు,

"ఇచటకూడ చాలపనిచేయవలసియున్నది. కాని యది కష్టమైనది. అయినను రహస్యాపరాధపరిశోధకులను తగినవారిని నియోగించి సంగతులను తెలిసికొనవచ్చును. వారుచేయుపనులను వర్ణించుటకు వీలులేదు. వారెంతటికార్యమునకైనను సమర్థులు. ప్రాతనేరములను బైటకుదీయుటయందు వారికి శక్తిమెండు. వారిచటకివచ్చి "సాక్షి" తీయుదురు. వారు మనోరమాభావమును కనిపెట్టుదురు. శివసింగునుండి

యేయుపాయముచేతనైన రహస్యము నూడదీయుదుగు. రమేశుఁడు వచించినట్లు శివసింగునకీసంగతి యంతయు తెలిసియేయుండును. ఇట్లు తగినంతపని చేసినచో వారు కమలాకరుని నేరము సత్యముకా దని నిరూపించి వానికివిమోచనము గావింపఁగలరు.

"ఇఁక మనసుందరమును ఖుదివలాలో వర్తించి తమయభిప్రాయములను తెలియఁజేసినవైశ్యులు కనికరించారని గవర్నమెంటువారికి తెలియఁజేసి క్రొత్తసంఘము నొకదానిని స్థాపించుటకు చేయవలెను. శివసింగు పిచ్చివాఁడు కాడనియు, వాఁతఁడు మోసగాఁడనియు, చాలవఱకతఁడు తెలివిగలవాఁడేయనియు, ఋజువుచేయుందము. అతనినేవిధముగనైన మనమాటాడునట్లు చేయుదము. అంతియకాక వేరున్యాయాధిపతి కమలాకరుని నేరము విచారించుటకును, ముఖ్యముగ నుండి విడదీయుటకును ప్రయత్నింతము. ఇట్లు మనకు సాధ్యమగునంత ప్రయత్నము చేయుదముగాక. ప్రయత్నముచే కొండనైనను పెకలింపవచ్చును. మనము వెనుదీయరాదు. దీనికి మీరెల్లరును తోడ్పడవలయును. తగినధనమును వెచ్చింపవలెను. అటుపైనజరుగుసంగతి చూతము. ఇంకొలకు వెనుకదీసినచో సర్వనాశము చెందుటయు. కమలాకరుఁడు బంధితుఁడగుటయు నిశ్చయము. అందుచే ధర్మపుర, మధునపురవాసులు ఘూర్ణిల్లుటయు జరుగును. ఇఁక మీయభిప్రాయములను తెలియఁజేయుదురుగాక" యని రవీంద్రుఁడు కూర్చుండెను. వారెల్లరు నాశ్చర్యపరవశులైరి.

"ఇంకొలకు మేమెల్లరమును సంతసించితిమి. మీప్రయత్నములందు మాచేతనైనంతసాయము చేయుదుము. నేఁడే కమలాకరుని జూచుటకేగుదము. మరియు వాతం డిదివఱ కిచ్చినవాఙ్మూలములును, సాక్ష్యములకునకళ్లు (Copies) తీసికొనవలెను. అవి నేఁడే తీసికొందముగాక" యనిగణేశగుప్తుఁడు పల్కెను. అంత వారందరును భోజనములు చేయఁబోయిరి.

భవానిశంకరుఁ డిదియంతయు చూచినంతనే వానికి రవీంద్రుని యందుభక్తియు ననుమరాలి కేమని చెప్పుదునా యనుసందియము గలిగెను. పట్టలేక యాతఁడు "స్త్రీలడిగినచో నేమని చెప్పవలయు"నని ప్రశ్నించెను. రవీంద్రుఁడును "స్త్రీలకు కొలఁదిదినములలో కమలాకరునివిచారణ కోర్టువారియెదుట జరుగఁగలదనియు నచట నితఁడు జయమొందుటకు సందియము లేదనియు చెప్పవచ్చును. అంతియ యాకాక యితరులతోను మాటలాడుచున్న దేమని యడిగిన భావిప్రయత్నములని చెప్పవలెను." అనిరవీంద్రుఁడు పల్కెను వారందరును గృహములకేగిరి



## 2 వ ప్రకరణము.



### సాక్ష్యాదికములు. (Records)

ప్రథమవిచారణసమయములో నిచ్చిన వాఙ్మూలములు, సాక్ష్యములాదిగాఁగలవన్నియుఁ జూచి నకళ్ళు వ్రాసికొనుటకు ననుమతి నొసఁగినవెంటనే రవీంద్రగణేశచంద్రులు కోర్టునకు పోవుచుండ, దారిలో రవీంద్రుఁడు "మనకిట్లనుమతి నిచ్చుట కేమికారణము? బహుశః ముఖర్జీ తనకేమి భయమును లేదని యెంచియుండనోపు. అందుచేతనే మన కనుమతి నిచ్చుట" యనుటయు గణేశుఁడు

"అతనితోడ చాలదినములనుండియు వ్యవహరించుచుండిన నాకాతని సంగతియంతయు బాగుగఁ దెలియును. అతఁడు భయము లేదనియే నిశ్చయముగా తలంచినచో నితరులతోడ మాటాడనంతటి గర్విష్ఠి. ఇఁక దయయే కారణమని తలంచినచో నాతనికి దయచూపు నవసరము గల్గినను చూపవెఱచును. దీనికి మూలకారణము కా

నేకారణముచేతనైన నోడిపోయినను తప్పించుకొనుటకు సాకుగ నుపయోగించుట"కని చెప్పెను.

ఇది సత్యమే. మొదట నవీనమోహనునితోడ నాలోచించియే యాతఁ డిట్లనుమతి నొసంగెను. నవీనునకు మనసులో కమలాకరుఁ డనిన యెక్కుడు దయయే కాని, తరుచు వారితో ప్రస్తావింపు చుండినచో నాతనినిగూడ ననుమానించి, సంగతులన్నియు తనతోడ చెప్పవలచునని, ముఖర్జీ కట్లు తోఁచకుండున ట్లాతఁడు సంచరింపు చుండెను. ఆకారణమున నాతఁడు వీరితో మాట్లాడుటకూడ మాని వైచెను. ఈకారణముననే ముఖర్జీ వానితోడ నన్నిసంగతులను గూర్చి యాలోచించుచుండెను. అందుచేతనే మొదట నవీనమోహనునితో మాట్లాడినపిమ్మట వారి కనుమతి నొసంగెను. ముఖర్జీ,

తనతో నాలోచించుటకు వచ్చినపుడు ముఖర్జీని నవీనుఁడు పరిహసించెను.

"కాలము మించినపిదప నాతోడ నాలోచించుటకు వచ్చితివా? " యని యాక్షేపించెను. ఇది యాతని కెంతయు కష్టముగ నున్నను తనపనిని వీడక " నావిధివిహితకార్యమును చేసినందులకు నన్నిట్లు పరిహసింప చెల్లునా? నేరముపైకితీయుట నావిధి కాదా? ఇఁక నాతప్పేమి? నేరస్థుఁడిదివఱలో నాస్నేహితుఁ డగుటచేతను, నేనాతని బందుగురాలిని వివాహమాడదలంచి యుండుటచేతను నాపని నుండి తొలఁగుట చెల్లునా? అట్లు కార్యమును సమగ్రముగ జేయనిచో పలువురు తూలనాడరా?" యని ముఖర్జీ మారువల్కెను.

"నిజమే కాని, "లోకులు పలుగాకు" లన్నట్లు వారొకరీతిగ నుండజాలరు. చేయవలసిన కార్యము చేయకున్నచో నధిక్షేపించిన వారే చేసినపుడు నిర్దయుఁడనియు, గర్వియనియు పల్కుచుందురు."

"ఇదియు సత్యమే. నన్ను న్యాయవాదులలో మేటియగు సీతానాథరాయ లభినందింపుచు వ్రాసినలేఖ చూడలేదా? అతఁడీయూరివాఁడు కానికారణమున న్యాయము నాలోచించి యిట్లు చేసెను. ఇఁక నీయూరి ప్రజలు బహుశః నేనట్లు చేసినందులకు నన్ను గర్హింతురు కాఁబోలు. వారందరును కమలాకరుఁడు నేరస్థుఁడనియు, నేనిట్లు చేయుట నావిధియనియు నెఱిఁగియుండియు నిట్లసహ్యముతో దూఁచిన చూతురుగాక! నే నట్టికార్యమునుండి విముఖుఁడను కాఁగల్గుదును? ఈనాఁడే నాపై యధికారి న్యాయశాస్త్రసమ్మతముగ పని చేయుచుంటిననియు, విజయము చేకూరుననియు, నభివృద్ధిగల్గుననియు వ్రాసెను" ఇట్లు చెప్పుచుండఁగ వినలేక:—

"ఏది యెట్లున్న నేమి? ఇంతటితో నీసంభాషణనుండి విరమింతముగాక! కమలాకరుఁడు దోషికాఁడో, యగునో నే నెఱుఁగను. నేరముమాత్రము వానిపైఁ బడినది. ఇదివఱలో నాతఁడు మంచివాఁడనియు, చదువుకొన్నవాఁడనియు, బుద్ధిమంతుఁడనియు నే నెఱుఁగుదును. పూర్వము మాయిరువురకును స్నేహముండెడిది. కాని యీ కారణమున దానికి విఘ్నము గల్గెను నాకందులకు విచారముగనే యున్నది. కాని నీ వేటికి వగచెదవు? నీవీకార్యమును చేఁబట్టితివి. విజయమును గాంచఁగల్గుదువేమో! అట్లయిన సంతోషింపవలసిన వాఁడవే; ఊరక విచారించెదవు?" అనెను. నవీనుఁడు,

ఇంతటితో విరమించి రాధాకాంతుఁడు వెడలిపోయెను వెంటనే రికార్డులను చూడవచ్చునని గుమాస్తాకు కబురంపెను. ఇది సాధారణముగా కోర్టులలో విచారణ పూర్తియైనపిమ్మట చేయుచుందురు. కాని, సౌకర్యముకొఱకు న్యాయాధికారి యిష్టమైనచో విచారణకు పూర్వమే యిట్లీయఁబడినది. ఈసందర్భములో తాను జయము గాంచితీరుదునని తలంచి ముఖర్జీ యిట్లుచేసెను.

ఇదివఱకునుండియు వీరికిహితుఁడై, కార్యముల నరవేర్చుచుండిన కరంచంద్ యీవార్త విని సంతోషముతో వారి కన్నికాగితములు నిచ్చివేసెను. వారు కావలసినవన్నియు వ్రాసికొనిరి.

వారెంత వెదకినను శివసింగువిషయమైన కాగితము లెవ్వియు నందు లేవు. రాధాకాంతుఁడు నేరము జరిగిన దినమున శివసింగిచ్చిన వాఙ్మూలమును, పిమ్మట నాతనినుండి వివిధప్రయత్నములు చేసి యితరసంగతులను, కూడ చెప్పించబోవుటయు, వైద్యశాస్త్రజ్ఞులిచ్చిన యభిప్రాయములును, మొదలగునవన్నియు పూర్ణముగ వదలివైచెను. అతని కట్లు చేయునధికారము గలదు. ఏవి యవసర మని తలంతుగో వానినిమాత్రము తీసికొని తక్కినవన్నియు న్యాయాధిపతి విడచివైచును. శివసింగు కోర్టుకెక్కినచో నాతఁడు ఫిర్యాదితరఫున సాక్షిగ నుండును అట్టివానిసాక్ష్యము నాధారముగ తీసికొని, యీనేరము నెట్లు స్థాపింపబూనితివని యధికారు లాక్షేపించవచ్చును. అందుచే నాతఁడు వానిసంగతియంతయు విడచివైచెను.

"ఇట్లు విడచివైచుటచే నాతని తెలివియంతయు తెల్లమైనది. నిజముగ మంచిపనియే చేసెను. కాని, నేరము నెట్లు స్థాపించునని గణేశుఁడు పృచ్ఛ చేసెను.

అది మిగుల సులభమైనపని. తారానాథుఁడు నేరముజరిగిన కాలము సరిగ వివరించెను. మొదటిసాక్షి చెప్పినప్రకార మానంద భవనప్రాంతములకు నేరస్థుఁడు పోవుచుండుటయు, నేరము జరిగిన పిమ్మట మరల నాతనిని చూచిన మూఁడవసాక్షి యుగుపువలిదాని వాఙ్మూలమును వివరించి, పిమ్మట నేరస్థాపనసమయములో మువ్వురి సాక్ష్యములును, దానితో నేకీభవించుటయు, వాని సాహాయ్యముచేత నేరస్థుఁడు తత్సమయమునకు పోయియుండుననియు, నేరము జరిగిన కాలమున వచ్చుట నుండెననియు స్థిరపరచెను,

పిమ్మట నాతఁడచట నేమి చేయుచుండెను? అను ప్రశ్న కుత్తరముగా రెండవదినమున చేసిన విచారణలో కమలాకరుఁడు నీటిలో చేతులు గడుగుకొనుటయు, తుపాకి పేల్చినట్లు జమీందారుని దేహమునందలి గుండ్లును, వారి యింటినమీపమున దొరకిన తూటాయు, కమలాకరుఁ డుపయోగించు తూటాగొట్టము నిదియు నొకే రీతిగనుండుటయు నిర్ధారణ చేయఁజాలియుండెను. దీనివలన నంతయు స్పష్టము. భయంకరముగను, నిర్వివాదార్థముగను, తేటతెల్లముగను, కమలాకరుఁడు దోషియని తెలుచుండెను. ఇది చూచినంతనే గణేశుఁడు "కమలాకరుఁ డేక నేరస్థుఁడైనను, కాకున్నను తగినంతసాక్ష్యము లేకున్నచో నెగ్గుట దుర్లభ" మనెను. అంత వారు తమకు వలయు విషయములను స్వీకరించుకొని చెఱసాలలోనున్న కమలాకరుని చూడ బోయిరి.

అతఁ డచట ధైర్యము చెదరియుండెను. వీరాతని కీసంగతులన్నియు దెలిపి, ధైర్యము గఱపి, విచారణ యంతమగువఱకును, హైకోర్టు (Sessions Court.) తీర్పుచెప్పునంతవఱకును తమకు కావలసిన విషయములన్నియు చెప్పుచుండవలసినదనియు, తమకు సాయముగ ముసలిరాఘవుని దీసికొనిపోవుటకును సమ్మతింపవలసినదనియు నాడంబరచిరి. తానుత్తరోత్తరములగు కార్యములకై కలకత్తా పోవుటకు స్థిరపఱచి రవీంద్రుఁడు వెడలిపోయెను.

ఆనాఁడే రవీంద్రుఁడును, భవానియు, రాఘవుఁడును కలకత్తాకు పోయిరి.

## 3 వ ప్రకరణము.

ప్రథమ ప్రయత్నము.

కలకత్తా చేరినంతనే రవీంద్రుఁడు భవానిని భర్తృగృహమున వదలి, యింటి కేఁగి, భోజనమైనపిమ్మట సహపాఠియు స్నేహితుఁడును ప్రస్తుతము దొరతనమువారి కొలువునందు రహస్యాపరాధపరిశోధకుఁడు నగు కరీమ్ అనువానిని బిలువబంచి, సర్వమును నివేదించి, వెటనైన రాణ్మహేంద్రవరమున కేఁగి తగిన భోగట్టా చేసి, సీతను గొనిరావలసినదిగ నియమించి పంపెను. అతఁడట్లు వెడలగనే తాను కమలాకరుని నివాసస్థానమగు 'రమావిలాస్'ను జూడఁబోయెను.

ఆవీధియంతయు పాడువడినట్లుండెను. అందు కూలి నాలి చేసి జీవించువారైదార్గుర యిండ్లును, పాడువడిన గృహములుకొన్నియు, దక్క నితర మేదియును లేదు.

రవీంద్రుఁడు కమలాకరునిగృహము ప్రవేశించి రెండుగంటల కాల మాయింటినంతను పరిశోధించెను రాఘవుఁడు వచించినరీతిగా నాగృహమంతయు క్రొత్తగ మరమ్మతు చేయబడుటచే నన్నియు క్రొత్తగనే యుండెను. అచట నతఁ డేదియు లాభము లేదని తలంచి మరల గవాక్షములన్నియు మూసివైచి తలుపును తాళముచే బిగించి వెడలిపోయెను. పిమ్మట చుట్టుప్రక్కల నివసించువారి నరయుటకై పోయెను. అచట నీగృహమును గుఱించి యెఱిఁగినవారును, ఒకయువకుఁ డిందు మారుపేరు పెట్టుకొని యొకానొక యువతితో వత్సరములో కొంతకాలము నివసించుచుండుననియు, నాకాలమందైన నామె కొన్నిగంటలుమాత్రమే యందు నివసించిపోవుచుండుననియు చెప్పఁగలవారును, ముగ్గురుండిరి. వా రాతనిని జూచినచో పోల్చుకొనఁగలమనియు, వాతఁడు నిజనామమును మాఱుగుపఱచుచున్నాఁడనియు తమకు తెలియునని చెప్పిరి.

పిదప నాయింటిలోనివారియుపయోగార్థము పాలుదెచ్చుపిల్ల లను కలసికొని మాట్లాడెను. ఆమె తనకు సీతస్నేహితురాలనియు, తరుచుగా సమీపమందున్న తనయింటికివచ్చుచుండెడిదనియు, నాకా లములో తనయజమానురాలు మిగుల రహస్యముగ ప్రవర్తింపుచుం డుననియు, నెన్నిమారులామెను చూడవలయునని ప్రయత్నించినను తనకు సాధ్యమగుచుండలేదనియు, తనయజమానుని తఱచు చూచు చుండినను, యజమానురాలిని చూడకోర్కెగలదనియు, చెప్పినట్లు తెలియజేసెను. మరియు సీత రాణ్మహేంద్రవరముననో, తత్సమీప గ్రామమునందో జననీ జనకులతో వసియింపుచుండెననియు చెప్పెను.

పిమ్మట వారున్నచోటు విడచి యింటికిపోయి లేఖామూలమును గ రవీంద్రుడు కగిమ్మనకంతయు నెఱింగించెను. గణేశునకు తనరాకను గూర్చి యొకలేఖవ్రాసి, మరునాడే మరల రవీంద్రుడు పాటలీపుత్ర మును జేరెను.

జగత్కిశోరుడును తనయునిచూడ నుద్దేశముతో రవీంద్రుని గూడివచ్చెను. మరునాటిమధ్యాహ్నము చెరసాలలో కమలాకరుని, జగత్కిశోరుడుకలసికొనెను. మాధవుడు తనయునితో జనకునియా గమనము తెలుపగనే కమలాకరుడు సంతోషముతో వాతని నెదు ర్కొనెను. వారిరువురు నొండొరులగౌగిలించికొని కొంతకాలము దుః ఖించిరి. కమలాకరుడు కొంతవడికి ధైర్యముదెచ్చుకొని "నాయనా! నిపుడన్నింతవరకును చూచుటకు రాకుండుటచే నాపైదయతప్పెన నియు, నిట్టిక్రొడుకుండుటకంటె లేకుండినను మంచిదేయని తలంచి, నామొగమును జూడనిచ్చగింపకుంటివనియు, నిన్నిదినముల నుండియు కని, పెంచిన తల్లిదండ్రులే నన్నువీడినచో నాకింకదిక్కెవ్వరని తలంచి దుఃఖింపుచుంటిని. ఇఁక నీవువచ్చితివి గనుక నావిచారము తొలగిపో యెను" అనిపల్కెను.

"మొదట కొంచెము కోపము వచ్చినది. కాని, కన్న కొడుకగుటచేతను ఏకపుత్రవిషయమగుటచేతను వంశోద్ధారకుడవగుటచేతను, నిన్ను మరువజాలకుంటిని. నిన్ను చూచుటకు రాకుండినను, కలకత్తాలోనే యుండిన మేలగుననియు, వలయు సన్నాహములు చేయవచ్చుననియు, తలంచితిని. కాని, నన్ను చూడకున్నచో నీవు ధైర్యము వీడుదువేమో యని యిచటికి వచ్చితిని. రవీంద్రుడు నాకంతయు నెఱిగించెను. కాని నీవు చేసినది చాల తప్పుపని. పరనారీలోలత్వము కానిపని. పరస్త్రీలను వాంఛించుటచే రావణాదులు నశించిరి. కాని, పుత్రమోహమును విడజాలముగదా!" యని జగత్కిశోరుడు మారుపల్కెను.

"తండ్రీ! నిజమే. మొదట నజ్ఞానముచే తప్పుచేసినను, ఇపుడు పశ్చాత్తాపము పొందుచున్నాను. మనలో కొందరు దైవము లేదనియు, మన కార్యములకు శిక్ష లేదనియు, పల్కుచుందురు. అది పట్టి భ్రమ. మన నేరములకు పరలోకమునకదా యనుభవింపవలెను. అందుచేత నీలోకమున నెట్లు సంచరించిననేమి? యని విఱ్ఱవీగుట వెఱ్ఱిపని. ఇచటి నేరములకేదో విధముగ నిచటనే దండన ననుభవింతుము. చోరుడు శిక్షితుడగుచున్నాడు; జారుడు రోగముల పాలగుచున్నాడు. అన్యాయప్రవర్తకుడు అంత్యకాలమున నిస్సహాయుడై చచ్చుచున్నాడు. అట్లే నేనును నా తప్పుపనికిచటనే శిక్ష ననుభవింపుచున్నాను" అని కమలాకరుడు వాపోవదొడంగెను. జగత్కిశోరుడు వానినూరార్చెను. పిమ్మట రవీంద్రుడు కొంతయూచూకీ తీసినాడనియు, కాని యది ప్రస్తుతము విచారణకు పనికిరాదనియు, చెప్పుచుండగ, రంగస్వామి లోనికి ప్రవేశించెను.

రంగస్వామి పొడుగైన బక్కపలుచని మనిషి. అతడు ముప్పది వత్సరముల వయసు కాడైయుండెను. అతడొక సామాన్యకుటుంబీకుని కుమారుడు. చిన్నతనముననే తండ్రిగతించుటయు, దుస్సాంగత్యము

లకు లోనై, ధనమునంతయు పాడుచేసెను. కొంచెము చదువుకొన్న వాడగుటచే నొక నౌకరీ సంపాదించెను. కాని, యందు పనికి రాకుండుటచే వారతనిని తోసివైచిరి. అతఁడెచట పనికొరకు ప్రయత్నించినను పూర్వ మెచ్చటనుంటివనియు, యోగ్యతాపత్రికలున్నవా యనియు, పని యిప్పించిన లంచమెంతయియ్యగలవనియు, పలు తెఱంగుల బాధలుపెట్టుచుండుటచే, ప్రాణములు విసిగి, పనులకై ప్రయత్నించుట మానుకొనెను.

ఒకనాఁడతఁడు క్షుద్బాధ కాగలేక, పలువురను యాచించి, విసిగి, వేసారి, ప్రక్కవారి తోటలో మామిడిపండ్లనుచూచి, యాగలేక, దొంగతనముగ కొన్ని పండ్లను తినెను. ఈకార్యము చేయుచుండగ జూచి యజమానిపట్టుకొని, పోలీసువారికి స్వాధీనపరచెను. వారాతని శిక్షించి చెఱలోవైచిరి. అతనికి విధించిన కాలము గడచిపోయినను, బాగుగ భోజనము దొఱకుచుండుటచేతను కారాగారమును విడువకుండెను.

“ఇంటికన్న గుడి పదిలమన్నట్లు వానికి స్వేచ్ఛావర్తనముకంటె యిచటనే బాగుగనుండెను. అంతియగాక ధనవంతుడగు కమలాకరునకు పరిచర్యసేయుటకు పనికివచ్చునని దొరతనమువారికి వ్రాసి యనుమతి తెప్పించి ముఖర్జీ వానినందులకు నియోగించెను. అతఁడును కమలాకరుని ప్రేమతో చూచుచు, పరిచర్యసల్పుచుండుటచే కమలాకరుఁ డాతనికి కొంచెము ద్రవ్యమిచ్చి యాదరింపుచుండెను. అతఁడు దానితో పుగాకుకొని కాల్చుకొనుచు, కమలాకరుని భక్తిశ్రద్ధలతో గొల్చుచుండెను.

రంగస్వామి లోనఁ బ్రవేశించి మిమ్ము జూచుటకు రవీంద్రుఁడును గణేశుఁడును వచ్చుచున్నారని యెఱింగించెను. ఇంతలో వారును లోనఁ బ్రవేశించిరి. కొడుకును వీడ్కొని జగత్కిశోరుఁడింటికిపోయెను.



## 4వ ప్రకరణము.

### పన్నుగడ.

న్యాయవాదుల నిరువురను కమలాకరుఁడు దనదగ్గఱని యుచితాసనాసీనులగావించెను. ఇదివరలో కమలాకరుని నిర్దోషిత్వమునందు నమ్మకము లేకుండినను, రవీంద్రుఁడు గన్గొనినవిషయములచే నమ్మకముపుట్టినవాఁడై గణేశుఁడు తానిదివరలో నొకస్త్రీయొక్క బూటకపుఖ్యాతిచే మిత్రుఁడును విశ్వాసార్హుఁడు నగుకమలాకరుని మాటల నమ్మనందులకు మనఃపూర్వకముగ పశ్చాత్తాప పడి క్షమార్పణ వేడికొనెను. పిమ్మట కమలాకరునితో రవీంద్రుఁడు తానొనర్చిన ప్రయత్నములకు ఫలితము నీరీతిగ నేకరువు పెట్టెను.

"మనము ప్రస్తుతావస్థలో ధృవపఱుపగల సంగతులు (1) గయావిలాసమున కధికారి కమలాకరుఁడు. అతఁడు మారుపేరుతో నందు వర్తింపుచుండెను.

(2) ఆగృహమున వసియించు కాలములో నాతఁడొక స్త్రీతో నుండువాఁడనియు, నామె తానెవ్వతెయో తెలియకుండుటకై తగినంత జాగరూకతతో మసలుచుండెననియు,

(3) ఆమె వత్సరమున కొకటి రెండు మాసములు మాత్రమే యచటికివచ్చుచుండుననియు, నాకాలమునకు సరిగ మనోరమ కలకత్తాలో నుండుననియు, స్థిరపరచుట"

"అగును. ఇదంతయు పూర్తిగా స్థిరపడినదని" గణేశుఁడు పల్కెను.

ఇదియేగాక, మనలో మనకు స్థిరపడినది. సీతయెట్లయిన మనోరమనుచూచి యుండుననియు, నామె దొరకినచో మనోరమను సీత తన

యజమానురాలినిగ పోల్చుకొనగలదనియు, నిశ్చయము. నేను తగిన మనుష్యులను పంపియున్నాను. వారు కొలది కాలములోనే సీతను కొని రాగలరు. కాని యీలోపుగ నీ కేసు విచారణకువచ్చుచో మనకు కావలసినన్ని యాధారములు లేవు. కనుక రేపటిదినమున పత్రికలలో ప్రకటింపఁబడఁగోర్టుకార్యక్రమమును బట్టి నేరమెప్పుడు విచారింపఁబడునదియు తెలియునుగదా. ఒకవేళ రేపుసోమవారమే యీ కేసు విచారింపఁబడుచో మనకు గలయీస్వల్పకాలములో సరియగు సాక్ష్యములతో కేసును ధృవపరుపఁజాలము. సాధారణముగ నీదినములలో యెంతటినేరములైనను నిజముపై నాధారపడియే గెల్చుట లేదు. కనుక దానికేదో యుక్తిపన్నాగము పన్నవలయును. అది నేనింతకు పూర్వమే నిశ్చయించుకొన్నాను. అది నేనిపుడు మీకు చెప్పెదను. మీరిరువురును సావధానచిత్తులరై విని మీయభిప్రాయము తీయగోరెదను." అని రవీంద్రుఁడనుటయు "ఇట్టి కల్పితకథతో మనమీవిషయములో జయముగాంచగల్గుదుమని తలంతువా?" యని కమలాకరుఁడు ప్రశ్నించెను.

"ఈదినములలో నిజమును గైకొని వాదించు న్యాయవాదులును నిజమగు నేరములను కనుగొని తీర్పునిచ్చు న్యాయాధికారులు, నున్నారని తలంచెదవా? ఎల్లరును ఇది నమ్మఁదగినదాయని చూతురు. నమ్మఁదగినచో నయ్యది తప్పక నిజమని ధృవపడును మనము నట్టిదానినే కల్పింతము. అంతియకాక, ఈ నేరము సీపై నారోపింపఁబడిన కాలములో నీకథ కంతయును మూలాధారము శివసింగైనను, వాని ప్రశంసయే మేజస్ట్రేటు తనకాగితములో వదలివైచినాఁడుగదా? ఏల? వానిని వదలివైచినను నేరము స్థాపించుటకు తగిన వీలు గలదు కనుకనే. అట్లే మనమును జమీందారిణి సంగతి నెత్తకుండగనే నీనిర్దోషిత్వమునకై వాదింతము. నిజమును పట్టి చూచినచో నీనేరము వాదించువారుగాని, నేరారోపణ సేయువారుగాని, వాదితర

పుస వాదించువారుగాని, యేయితరులుగాని, నిజమును గన్గొనఁ జాలరు గదా? కావున నే నొక ప్రతికథను కల్పించినాను." ఇట్లు చెప్పి వారి యభిప్రాయము లెట్లుండునో యని రవీంద్రుఁడు కొంతవడి యూరకుండెను. అతఁడింకను చెప్పినచో నీభారమంతయు తనపైననే పడుననియు, నొకవేళ, కర్మముచాలక పరాజయము గల్గినచో నేరస్థుఁ డీ కార్యమును నాకే వదలివైచినచో నేనట్లో "తంటాలు పడి యుండెడివాఁడనుగదా. అట్లుచేయక నాకొంప తీసితి" వన్నచో "తానేమి చేయవలసి యుండు"నని యాలోచించుకొనుచుండెను. మరల యిట్లని ప్రారంభించెను. "నేను చెప్పెడి దంతయు నాభావమునకు సరియని తోఁచుచున్నది. నిజముగ నాసోదరుఁడే యిట్టి యవస్థలో నుండినను నేను వాని కీరీతిగనే చెప్పియుందును. దీనికనుమతించుట కాని, కాదనుట కాని నీకుంమున్నది. నీయిచ్ఛ వచ్చినట్లు చేయుటకు సంసిద్ధుఁడను."

కమలాకరుఁ డేదియు చెప్పలేదు. అతఁడు తెరఁదీసివైచినట్లు నిజమునంతయు చెప్పివేసినచో విజయము చేకూరదాయనియు, నొకవేళ యట్లుకాక, అపజయమే గల్గినచో నేదిచేయుటకును వీలు లేదుగదాయనియు, ఇప్పుడు వీరు చెప్పినట్లుగ నసత్యములు పల్కి ముక్తి గాంచుట కర్తవ్యమా యనియు వివిధవిధములుగ నాలోచించు కొనుచుండెను. అతని క సత్యములు పల్కుట యనిన చాలకష్టముగ నుండెను. మొదటినుండియు సత్యమే పలుకుట కలవాటు పడినవాఁడగుటచే దబ్బరలాడుట యనిన నాతని మనసొల్లకుండెను. కాని వీరు మాత్ర మంతటి యధర్మపరాయణులా? వీరికిమాత్రము సత్యమనిన యిష్టములేదా? కాని, చేయవలసిన దేదియని యాలోచించు కొనుచు "నీయభిప్రాయమేమి ?" యని గణేశుని ప్రశ్నించెను. కాని గణేశుఁ డిదివరకే సంపూర్ణముగ నాలోచించి, రవీంద్రుని మార్గమే య

నుసరణీయమని నిశ్చయించుకొన్నవాఁడగుటచే వినువుతో "ఇదివరకే మనమీవిషయముపై చర్చసల్పితిమి. మీవారెల్లరును, నేనును గూడ రవీంద్రుని మేధాశక్తి కచ్చెరువడి. యాతఁడు చెప్పినమార్గమునే యనుసరించుటకు నిశ్చయించితిమి. అట్టిసమయములో రోగిని వైద్యుఁడు నీకీమందు త్రాగుట యిష్టమాయని యడుగునట్లు నిన్నితఁడు మరల ప్రశ్నించి యుండఁగూడదు. కాని యడుగుటచే పెడమార్గములు బట్టక యీతని మార్గము ననుసరించి మేలుపొందవలసినదనియే నాయభిప్రాయము. ఆపైన నీయిష్టము, 'ఒకవేళ రోగికి మందు రుచింపనట్లే నీకు నిది సరిపడనిచో నీ వేద్వీపాంతరవాసశిక్షకో సిద్ధపడి యుండవలసి వచ్చు"నని చెప్పివేసెను.

ద్వీపాంతరవాసము, మరణము, అనుమాటలు విన్నతోడనే కమలాకరున కింక వేఱుమార్గము లేదని నిశ్చయమయ్యెను. అందుచేత "నేను మీవశమైతిని. పాలముంచినను నీటముంచినను మీదే భారము. నేనుచేయవలసిన దేదియో తెలుపుఁడు." అనియాతఁడు పల్కెను. అతఁడు చాలపట్టుదల గలవాఁడు. ఒకమారేదియైన స్థిరపరచుకొనినచో దానిఫలిత మెట్లున్నను చేసితీరును. ఈతని దృఢసంకల్పము తెలిసికొన్నంతనే సంతుష్టచిత్తుఁడై రవీంద్రుఁడు తానుకల్పించిన కథ నేకరువు పెట్టసాగెను.

ఇదివరలో చాలదినములనుండియు రవీంద్రుఁ డీ యుపాయమునుగూర్చి యాలోచించుచుండెను. తుదకతఁడు కాలముమించి, తగినంత నిదర్శనములు సేకరింపకున్నచో నీమార్గమునే యనుసరింప వలయునని తలంచియుండెను. అతఁడు నాదుల వంశమువారిని, వారిభావములను, తెలివితేటలను, మూర్ఖత్వము నంతయును, పూర్ణముగ నెఱింగినవాఁడగుటచే తనకీ విషయములో జయము నిశ్చయమని పూర్ణముగ వానికి దోఁచెను. కనుకనే యాతఁడు సాహసించి యీకథను పీఠికయందు బెట్టుట కుద్యుక్తుఁడయ్యెను.

"ఈనూతనపథమే సరియని నిశ్చయించుకొన్నవార మగుటచే మనము మనోరథము పూర్ణముగ మరచిపోవలెను. మనము చేయవలసిన దెద్దియును, నారాత్రి కమలాకరుఁడేమి చేసినదియు మనకు చెప్పవలసిన యగత్యములేదు. అతఁడు బయటకు పోవుటకు కారణము మాత్రము నిశ్చయింపవలెను. దానికొక యుపాయము నాకు తోచినది. దానిమూలముగ జయము నిశ్చయము."

"అదియేదియో చెప్పుచున్నాను వినుఁడు. నీవానందకు లేఖను వ్రాసియున్నావుగదా? అందత్యంతావశ్యకములగు పనులుండుటచే రాజాలనని వ్రాయలేదా? దీనివలన నీవంతకుపూర్వమే యాలోచించుకొంటివనియు, సంకుమూలముననే నీవామెకా లేఖనంపియుంటివనియు తెలియుచున్నదిగదా? నీకు ప్రతికూలురు దీని నాధారముగగొని నీవు హత్యనుద్యమించితివని పల్కుచున్నారు.

మనకు నదియే తగిన యాధారము, దానిమూలముగనే వారిమాటలను త్రిప్పివేయగల్గుదుము.

"అట్లయిన వారికామె యాలేఖనిచ్చివేసినారేమి?" అని కమలాకరుఁడు ప్రశ్నించెను.

"లేదు. కాని, మేయరు, భవానిశంకరాములును నాకీసంగతి చెప్పియున్నారు. తమపరి నిన్న నేకసార్లు ముఖర్జీ యీవిషయమై ప్రశ్నించియున్నాఁడు." అని తన కాగితములకట్టలోని యంశముల నీరీతిగ చదివి వినుపించెను.

ప్రశ్న:—నీవు కొలదికాలములో ఆనందమయి యను కన్యకను వివాహమాడబోవుచున్నావు గదా?

ఉత్తరువు:—అగును.

ప్ర.—కొంతకాలమునుండియు సాయంకాల మామెదగ్గర గడపుచుండుట లేదా?

ఉ:—ప్రతిదినము నట్లు చేయుచుంటిని.

ప్ర:—నేరము జరిగినరోజుమాత్ర మట్లు చేయలేదు కాదా?

ఉ:—కారణాంతరముచే నట్లే.

ప్ర:—నీ కాదినమున నట్లు పోకుండుట కామె యాశ్చర్యపడ లేదా?

ఉ:—లేదు. నేనామెకు రాజాలనని వ్రాసియుంటిని.

అంత గణేశుడు "చూచితివా? ముఖర్జీ నీవు లేఖను వ్రాసిన ట్లు పప్పుకొన్నంతనే యిక నావిషయమును మరల ప్రశ్నింపలేదు. మరల నడిగినచో నీకనుమానము గలుగునని యట్లు చేసియుండెను" అ నెను. రవీంద్రుడు మరల "నీయారవవాఙ్మూలములో నిట్లున్నది:—

ప్ర:—నీవేయుద్దేశమును లేకుండగనే తుపాకిని గొని పోయి తివా?

ఉ:—అది నాన్యాయవాదులతో నాలోచించి చెప్పెదను.

ప్ర:—నిజము చెప్పుటకు న్యాయవాదు లెందులకు?

ఉ:—అది నానిశ్చయము.

ప్ర:—ఆదినము రాత్రి పదిగంటలవరకు నేమిచేయుచుంటివో చెప్పగలవా?

ఉ:—అదియు నప్పుడే చెప్పెదను.

ప్ర:—నీకొఱకానందకని పెట్టుకొని యుండినను రాకుండుటకు తగినంతపని యుండి యుండును.

ఉ:—నాకొఱకు కనిపెట్టుకొని యుండవలదని వ్రాసియుంటిని.

"అబ్బ! ముఖర్జీ యెంత తెలివి గలవాడు" అనిగణేశుడనెను.

రవీంద్రుడు—చిట్టచివర విచారణకు పూర్వము వాఙ్మూల ము నందినట్లు చెప్పియున్నావు.

ప్ర:—పాటలీపుత్రమునకు పంపుటకు సాధారణముగ నెవని నియోగింతువు.

ఉ:—నా రైతుకుమారుఁడగు సుబ్బుసింగును.

ప్ర:-అట్లయిన నాదినమున నీలేఖను గొనిపోయినవాఁడాతఁడే కదా?"

ఉ:—అగును.

ప్ర.—ఉత్తరములో నిరు పనియుండుటచే రాజాలనని నాకు చెప్పితివి కదా?"

ఉ:—అగును. సాధారణముగ నట్లే చేయుదును.

ప్ర:—కాని యీవిషయములో నాకు కాదు అనాఁడు నీవెచటి కేగితివి?

ఉ:—అది న్యాయవాదులతో నాలోచించి చెప్పెదను.

ప్ర:—చెప్పనమాటయు, దాచుటయు కొంతకారములకు జ్ఞాపకముంచుకొనుము.

ఉ.—అది నేనెఱుగుదును. ఎట్లయినను తత్ఫలమనుభవింపుటకు సంసిద్ధుఁడను."

ఇది వినినతోడనే కమలాకరు డాశ్చర్యపడెను. అతనికిట్లు చెప్పినట్లు జ్ఞాపకము లేదు. ఎంతటి మేధావియైనను రెండుమాసములలో నేమి చెప్పెనో యెట్లు జ్ఞాపకము పెట్టుకొనగలఁడు? అదియుగాక, ఏతఁ నుండిన స్థితియు నట్టిదే. కాని, గడ్డిపరకలు వెంటిగా నేర్పడి మదపుటేనుఁగునైనను బంధించునట్లు వాని మాటలన్నియు నొకటిగా చేరి ప్రబలమగు ప్రతికూలసాక్ష్యములయ్యెగదా!

ముఖర్జీ నేర్పుతో కమలాకరుని వివిధసమయములందు ప్రశ్నించినప్పు డిచ్చిన యుత్తరువులన్నియు కమలాకరరాయలు మరచిపోయెను. రవీంద్రుఁడు వానినిప్పుడు వినిపించఁగనే తానొక ముఖ్యమైన రహస్యకృత్యమున కారాత్రి పోయిన ట్లొప్పుకొనుట తెలిసికొని "ఇంకేమున్నది. నా నేరము స్థాపింపబడినట్లే. దీనినుండి యెట్లు తప్పించుకొనుట" యని యధైర్యముతో వణఁకెను.

"నీవు చెలియుండుటచే నీమదికి వేరువిధముగ దోచుచున్నది. కాని నాకీవిషయమును గూర్చి యాలోచించుటకు బాగుగ వీలుకల్గినది. దీనికి తగిన సమాధానము నిదివరకే యాలోచించియున్నాను. ఈవివాహమెచట జరుగవలసియున్నది?" యని రవీంద్రుఁడు ప్రశ్నించెను.

"రంగాపురమునందలి యాలయములో"

"మతగురువుతో నీవిషయమై చెప్పితివా?"

"చెప్పియుంటిని. దానికి వలయు ప్రయత్నములంగూర్చి యాలోచించి యుంటిమి."

"ఆతఁడు నీస్నేహితుఁడా?"

"అగును. నాకు మంచిస్నేహితుఁడు. అనేకమారులు నేనాతనిని విందులకు పిలిచి యుంటిని" అనుటతోడనే రవీంద్రునకు సంతసముగల్గెను.

ఇఁక మన కార్యము కడుసులభము. ఆరాత్రి తొమ్మిది మొదలు పదునొకండు గంటలవరకును వారియింట నెవ్వరును లేరు. వారారాత్రి సమీపముననున్న బంధువుల యింటికి విందుగుడువబోయిరి. అప్పుడు నీవు వానితో నీవిషయముంగూర్చి మాట్లాడుటకును, దైవభక్తుఁడును, సజ్జనస్తోత్రపాత్రుఁడు నగు వానితండ్రితోడ నీసంగతినంతయు చెప్పి యాశీర్వచనములు బడయుటకును పోయియుంటివని చెప్పవచ్చును. ఇది యత్యంతముఖ్యమగు కారణమగుటచేతను, ఒకవేళ యానందకీవిషయము తెలియజేసినను ఆమెకు నీసాంగత్యమును వీడియుండుట కష్టముగా నుండకపోవును గనుకను, యింతటి కార్యమునకే నీవామెదగ్గరకు పోకుండుట కామెకు కష్టముగ దోచవచ్చునని యు, తలంచి, నీవామెకు పనియుండుటచే రాజాలనని సాకు వ్రాసి తప్పించుకొనజాలితివనియు చెప్పవచ్చును."

"అది చాలా బాగుగ నున్న"దని గణేశుఁడు హర్షించెను.

"ఇట్లు చెప్పినచో వారు పూజారిగృహమునకేగుటకు వేఱ మార్గము తెలియఁబెట్టితినని ప్రశ్నింపవచ్చును. అది దగ్గరదారి గనుక యని చెప్పవలెను. అంతేగాక, అతఁడు తొమ్మిదిగంటలు దాటినపిదప నిద్రపోఁగలఁడనియు, యిదివఱలో నిట్లు రాదలంచినట్లు చెప్పియుండుటచే వాఁడు నీకై వేచి యుండడని భయపడుటచేతను, త్వరగా నచట చేరుతలంపుతో నట్లు పోయితినని చెప్పవచ్చును. అట్లుపోయి తలుపు తట్టితిని. కాని యెంతపిలిచినను యెవరును పలుకలేదు."

"ఇదియంతయు సమంజసముగానే యున్నది. కాని, చిట్టడవిగుండా నేల పోయితివన్నచో నేమిచేయవలెను? యీ ప్రదేశమంతయు బాగుగ తెలియదు కాని. రంగాపురమునుండి వారి యింటికి మగలివచ్చుదారికిని, చిట్టడవికిని సంబంధ మెద్దియును లేదు." అని కమలాకరుఁడనెను.

"అదియు చూచితిని. ఈప్రశ్న రావచ్చుననియే దాని కనువగు జవాబును సమకూర్చితిని. నీవు తలుపు తట్టుచుండగా నొక బాలిక ఈబాటను పోవుచుండెననియు, ఆమె పూజారిని తాను చెఱువుదగ్గర కలసికొంటినని చెప్పుటయు, నీవు వానికొఱకై చెఱువునకు చిట్టడవిగుండా పోయినచో నాతనిని కలసికొనజాలుదువని యామె చెప్పుటయు, నీవట్లు చేసితివి. కాని, యామె చూచిన పూజారి వేఱొకఁడు. నీవట్లుపోయి, వేఱొకపూజారినిచూచి, యాశాభంగముగల్గుటచే సీతాసదనమునకు చిట్టడవిగుండా తిరిగి పోయితివి. అట్లు నీవు తలంచిన కార్యమునకు విఘ్నము గలుగుటయే కాక, ఆనందతో సుఖముగ కాలము గడుపుటయు చెడిపోవుటచే, కొంచెముగూడ పాడగుటచే కోపము గల్గుటయు, నాకార్యమున కొండవసాక్షికి నీవట్లు కనబడితివనియు చెప్పవచ్చును.

"సరియే. అట్లుచెప్పినచో శ్రోతవర్గులు, యీమాత్రపుపనికి న్యాయవాదితో నాలోచింపనేలయని యడుగరా?"

"నిజమే. అదియే మన సన్నుగడలో నమ్ముటకు వీలు లేనిది. కాని, నేనిది యంతయు నిత్తుగా వ్రాసియుంటిని. గణేశునిసాహాయ్యముచేతను కరంచంద్ సాహాయ్యముచేతను తదితరులగుమిత్రులసాహాయ్యమూలమునను, యెట్లయిన నమ్మునట్లుచేయుదురుగాక. ఈరీతిగా కమలాకరుఁడు మొదటనే చెప్పినచో నిగడబడయే లేకుండెడిది కాని, జరుగనిదానినిగూర్చి చింతించుటవెఱ్ఱితనము. ఇఁక ముందుగు సంగతి నాలోచింపవలెను మొదటనీవిషయములో రాజకీయములనుకూడ చేర్పనెంచితినిగాని, యది వీలుగాదనిమానివైచితిని విచారణసమయమున కేదో యొకటి యాలోచించెదను నాకథకంతయు మీరు సమ్మతించినచో, మొదటివిచారణలో కమలాకరుఁడు పుల్లలమ్మువానిని కలసికొనుటకు పోయియుంటినని చెప్పెను. అది మనకొక యభ్యంతరము. ఇఁక మిగిలినదంతయు బాగుగనే యున్నది. కమలాకరుఁడు చేసిన కార్యములను కొంచెము మార్చినచో మిమ్మట నంతయు బాగుగానుండును. కమలాకరునకు చుట్టలు కాల్చుట యందెక్కుడుప్రీతి అందుచేత వాఁడు చుట్టలను పట్టుకొనిపోయెను. గాని యగ్గిపెట్టె మఱచెను. కొంతదూరము పోయినపిదప వాఁడాసంగతి గ్రహించెను. అందుచేత సాధారణముగ తుపాకి నుపయోగించువారి పద్ధతిని విస్ఫోరగుల్కొల్పెను అనేకసారులట్లు చేసెను.

ఈకారణముచే చేతులు మసియగుటయు, వానిని కడుగుకొనుటయు తటస్థించెను. ఈనిరేకదా యింతగ ననుమానముగలుగఁజేయుచున్నది. అదియే మనకున్న ప్రబలమగు సాక్ష్యము. నిజముగ నేరస్థులమైనచో నిరువళ్లేలయుందుము? హంతకుఁడు తన రక్తసిక్తమైన దుస్తులనుంచుకొనునా? వానినెట్లో వదల్చి

వేసికొనును. అట్లే మనమును పిల్లిని పారబోసియో, మరియేరీతిగనో రూపులేకుండగ జేసియుందుము. ఇఁక తక్కిన నేరములు నంతటివే. అదియేకదా మనము నేరముచేసితిమని నిర్ధారణచేయుటకు సంకల్పించిరి? అఖండజా బాకతార్కాణమందురుకదా? అది తప్పు. ఎవఁడైన హత్యనుద్యమించినచో, నదిచేయుదునని గాని, మరియేదో ఘోరకృత్యము సేయుదుననిగాని, లేక యట్టియర్థము నిచ్చులేఖ వ్రాయుటగాని చేయునా? అది తనప్రాణములపైకి రాదా? అదియేగాక, యెవఁడైనను హత్యను సంకల్పించి, పిట్టలను గొట్టుటకై యుపయోగించు చిన్న రవ్వలుపయోగించునా?

"సూదితో బోవుదానికి గొడ్డలి నెవఁడుపయోగించును?"

కమలాకరుఁడు "ఆమాటనే పలుమారు ముఖర్జీతోనంటిని. కాని యాతఁడు పెడచెవిని బెట్టెను. నిజము. మనమీమాటను బాగుగ గుర్తింపవలెను" అనియెను.

అంతియగాక, రాఘవుఁడు వాకొకటిచెప్పెను. అతఁడు నేరము జరిగినదినమునకు పూర్వపుదినము నితుపాకిని శుభ్రపఱచినట్లు చెప్పెను నీవు దానినుపయోగింపకున్నచో మనము తప్పక నొగ్గతిరుదుము." అనెను రవీంద్రుఁడు,

ఆహా! అని చకితగాత్రుఁడై పల్కుచు "ఉండుము. జ్ఞాపకము చేసికొందును. అకటా! ఆదినమున నేనొక చెవులపిల్లిని చంపితిని. ప్రతివిషయములోను మనకు దైవము ప్రతికూలముగనే యుండెను కాని సాధారణముగ రెండు గొట్టములుండినచో కుడివైపు గొట్టమునే యుపయోగింతుము. నేను నట్లే చేసియుండి తీరవలెను. కాని పూర్తిగ జ్ఞాపకములేదు." అని కమలాకరుఁడు పల్కెను

అట్లయినచో నిట్టిసందిగ్ధవిషయమును మన మిత్తుకొనగూడదు నీవు తుపాకిపిచూచి పీలుయినచో నీమాటను చెప్పుమని గణేశుఁడనెను.

"ఇదియే మనకు తయారయిన చిత్తు తీర్మానము. దీనికి విచారణ సమయములోగా మెఱుగుపెట్టి తయారుచేయుదము. ఇంక మేము పోవుదముగాక!" అనెను రవీంద్రుఁడు.

ఇంతలో కమలాకరునకేదియో జ్ఞప్తికివచ్చెను.

"ఒకనిముసమాగుడు. నాకొక క్రొత్తయూహ తట్టుచున్నది. మనోరమ నాకొఱకై తప్పక పరితపించును. ఈపాటికామెకు విచారముగలుగక మానదు. కనుక నే నొక లేఖవ్రాసి మీకిచ్చెదను. మీలో నొకరుపోయి ఆమెను కదపిచూచిరండు. మనకేమైన నామె సాహాయ్యముచేయవచ్చును" అనెను.

"సరే మంచియూహయే. కాని లాభముండదనుకొనెదను. అయినను వ్రాసియిమ్ము నేనేపోయెద"నని రవీంద్రుఁడు. అంత కమలాకరుఁడు,

"మనసంగతింతయు 'నా సలహాదారులకు' చెప్పివేసినాను. ఇప్పుడైనను రక్షింపుము. మనసంగతినెత్తను. నేనిట్లు చావునకు సిద్ధముగుచుండ నూరకొందువా? రమా! ఇప్పుడైనను నన్ను రక్షింతువని తలంచెదను. కమలాకరుఁడు" అనివ్రాసి లేఖను రవీంద్రునకిచ్చెను. వారు నాతని వీడ్కొని గృహములకేగిరి.

---

## 6వ ప్రకరణము.

### కపట నాటకము.

మరునాటి యుదయమున కమలాకరుఁడు నిర్దేశించిన ప్రకారము మనోరమను రవీంద్రుఁడు కలసికొననెంచెను. ఈ కార్యము తానొకఁడే చేసినచో నే ప్రకారముగా పరిణమించునో, అట్లు చేయుట మంచిదగునో కాదో యని యడుగుట కాతఁడు రమేశుని దగ్గరకు

పోయెను. రమేశుఁ డతనిఁజూచి "విశేషము లేమియని యడుగుచు తాను చదువుచున్న గ్రంథమును బల్లమీఁద నుంచెను.

"కమలాకరుఁడు నాకొక పని ప్రయోగించినాఁడు. అందులకు మీసాహాయ్యమవసరము. మనోరమతో నేనొక సంగతి మాట్లాడ గోరెదను. అతఁడామెకొక లేఖనిచ్చినాఁడు. మీరెట్లైన నేనామెతో మాట్లాడుటకవకాశము గల్పింపవలెను."

"అది వీలుకాదు. మనోరమ భర్త చాల దుస్థితియందున్నాఁడు. ఆమె నిరంతర మాతనిని కనిపెట్టుకొనియుండును. అందుచేత నామె బైటకురాదు. ఆమెను కలసికొనుట కవకాశము లేదు." అని రమేశుఁడు బదులు వల్కెను.

"మీరాతనికి చికిత్స చేయుచున్నారుగదా? అతనిని చూచునట్లు పోయి, ఒకమారు నేను మాట్లాడుటకు రహస్యముగ వచ్చితినని చెప్పుడు." రమేశుఁడు కొంతవరకు నాలోచించి

"సరే యెట్టిపనికైనను సిద్ధమే. మిత్రుని రక్షింపవలెనని తలంచినచో నెట్టిపనినైన చేయవలయును గదా?" యనిపల్కి దుస్తులను ధరించి రవీంద్రునితో మనోరమాగృహాభిముఖుఁడై వెడలిపోయెను.

ధనపురపు జమీందారు తనయిల్లు కాలిపోయిన పిదప పాటలీపుత్రములో మహారాణివీధిలోనుండిన యొక పాతగృహము నద్దెకు తీసికొనెను. అందు పూర్వము ధనికులగు వర్తకులు వసియించుచుండిరి. దానికిచుట్టును ప్రాకారముండెను. ముందు నొక కోట తలుపువలె పెద్ద కవాటముండెను. పగటివేళల దానిని తీసియుందురు. కాని కఱ్ఱతో చేయబడిన యొక తడికవంటి తలుపు వేసియుంచును. దానిని తెరచినచో లోపలిగంట మ్రోగును. లోన నొక చిన్న మేడయుండెను. అందుక్రింద నొకచావడియు, దానికిరుప్రక్కల రెండుచిన్నగదులును, ఒకచిన్నగది ప్రక్కమెట్లగదియునుండెను. పైనున్నగదిలో రోగియగు జమీందారు

పరుండియుండును. రమేశుఁడు ప్రక్కగదిలో రవీంద్రుని కూర్చుండఁజేసి పైకిపోయెను. ఆగదిలో తగులబడగామిగిలిన కుర్చీలు, సోఫాలు మొదలగు సగముకాలిన సామానులు, చిందరవందరగ పడవేయబడి యుండ నందొకకుర్చీపై రవీంద్రుఁడు కూర్చుండెను.

ఇట్లాతఁడైదారు నిముసములు కనిపెట్టుకొని కూర్చుండుసరికి మనోరమ ప్రవేశించి "మీరు నాతో నేదో మాట్లాడ నెంచితిరఁట కాదా? యని ప్రశ్నించెను.

"అగునండి"

"దేనినిగూర్చి?"

"కమలాకరునిగూర్చి. అతఁడెట్టిస్థితియందుండినదియు మీకు తెలిసియేయున్నదికదా?"

"అగును అతఁడు ఘోరకృత్యమును తలపెట్టినాఁడు. దైవకృప మాయందుండబట్టి కాని, లేకుండిన నీపాటికి మాదశ యెట్లుండవలసినది. నేను, నాపిల్లలును దిక్కులేనివారమై యల్లాడవలసెడిఁ గాదా?"

"నిజమే కాని యాతఁ డట్టిక్రూరకృత్యము లాచరించువాఁడు కాఁడు. అతఁడు స్వగౌరవమును గోలుపోవుటకైనను సమ్మతించి పరుల సంగతి బైటబెట్టకుండినాఁడు."

"ఏమిటది ? ఎవరి సంగతి?"

"అతఁడు మీకీలేఖనిమ్మని నన్ను పంపినాఁడు"

ఇంతవరకును మనోరమ యించుకంతయు తొట్రుపాటును సూచింపలేదు. ఆమెసహజసౌందర్యమించుకైనను తప్పలేదు. కాని నిరంతరమును పతినిష్ఠ ధ్యానమునందే వర్తింపుచుండుటచేతను, నిద్రలేమిని, మొగము కొంచెము వసివాడియుండెను. తలవెండ్రుకలు సంస్కారములేమి చిందరవందరగ నెగురుచుండెను. ఆమె యొకించుకైన భావము మార్పువహింపక లేఖ విప్పిచదివి,

"ఇందలిసంగతి మీకు తెలిసియే యున్నదికదా?" యనియె.

"చిత్రమది రవీంద్రుని మెల్లగననెను." న్యాయశాస్త్రులనగా నాంగ్లేయులకు మతగురువులవంటివారు. వారితో నిట్టి రహస్యములును పాపములును, పుణ్యములు మొదలగున వన్నియు చెప్పివేయవలసినదే కదా? కనుక, దీనిలోని సంగతులన్నియు వారికి తెలిసియే యున్నవి."

అనుటతోడనే కోపముతో ముఖము జేవురింప, కన్నుల దారుణభావము సూచింప,, ఎంతసాహసము! నాతండ్రిగాని పెనిమిటి గాని పిలుచునట్లు రమా యనియేదేదో వ్రాసినాడు,,

"ఆగుడండి! పూర్వము మీరాతనిని కలకత్తాలోనిరమావి లాసమునందు కమలమని పిలుచునప్పుడు నిమ్మట్లు పిలుచువాడుగ చే నట్లువ్రాసియున్నాడు.'

"ఏమి? కమలాకరుడు నన్ను తనయుంపుడుకత్తెయని నుడువ సాహసించుచున్నాడా ఏమి?

"సత్యము. వారట్లు చెప్పియున్నారు"

"ఓహో! నాపెనిమిటిని చంపనుద్దేశించి, తుపాకి ప్రేల్చి, ఆతనిని గాయపరచి, మాయింటికి నిప్పంటించి, పైగా నాపై నింద మోపజూచుచున్నాడుగా? మీ సన్నాహమంతయు తెలిసినది. ఏమను కొనుచున్నాడు? నానాథుడు గతించెననియు, నేననాథననియు తలం చెనా యేమి? ఇపుడే యీ లేఖను నాభర్తకొసంగి తగిన చర్యను తీసికొనియుందునుగాని, మాత డిప్పుడు రోగపీడితుడై యున్నాడు జాగ్రత్త. ఇట్టి కారులరచునా? యని గట్టిగానఱవసాగెను. అంతట రవీం ద్రుడు కంపమొందుచు "నెమ్మదిగా మాట్లాడుడు. పరులు విందు" రనియెను.

"ఏల నెమ్మదిగ మాట్లాడవలెను? ఇట్టివి విందురని మీకు భయము గాని నాకేల? ఈయూరనన్నెఱుగనివారెవరు? దురాలాపము లాడసా హసింతురా? ఎంతఘోరము! ఇది యెల్లరు వినవలయుననియే నాకో

గిక" యనిరక్షించెను. అంత కొంచెము ధైర్యము తెచ్చుకొని, ఇట్టిది తటస్థించగలదని యెంచియున్నవాఁడగుటచే "మీరిట్లనిన లాభము లేదు. తగిన నిదర్శనములున్నవి. అయినను మీకీర్తిని పాడుచేయుట కిష్టము లేక, కమలాకరుఁడు నగివంత రహస్యముగనే యుంచినాడు. కనుక నెమ్మదిగ మాట్లాడుడని" నెమ్మదిగ ధైర్యముతో పల్కెను.

"ఏమీ? నిదర్శనములున్నవా! అట్లయిన ఋజువుచేయుము. ఇదే నా నాథునికి చెప్పెదను. జాగ్రత్త" యనియరచుచు రవీంద్రుఁడు పిలుచుచున్నను వినక మనోరమ వెడలిపోయెను. రవీంద్రుఁడు నిశ్చేష్టుఁడై నిలువబడిపోయెను. ఇంతలో రమేశుఁడు మెల్లగ లోనికి వచ్చి రవీంద్రుని వీపుపై చేయివైచి తట్టి "ఇంత నెమ్మదిగ మనోరమ మాట్లాడునని నేను తలంపలేను. ఆమె బైటకువచ్చినంతనే యేమియు నెఱుగనిదానివలె తననాథునిగూర్చి ప్రసంగించినది. నేను—" అని యేదో చెప్పబోవుచుండగా రవీంద్రుఁడు "నేను కలగనుచున్నానా? నిజమా? ఏమిది? నేననేకులను చూచితినిగాని, యింతచక్కగ తనపాత్రను నిర్వహించిన నటిని నేనెన్నఁడును చూడలేదు. ఎంతకపటనాటక మాడినది! నన్నే సంభ్రాంతపడవైచినదిగదా?" యనియె.

రమేశుఁడు వానిని గదినుండి యావలకుఁగొంపోయి "ఏమిజరిగిన" దని ప్రశ్నించెను. రవీంద్రుఁడు జరిగినదంతయు చెప్పి "ఇట్టి ధైర్యశాలిని, మోసగత్తెను నేనెన్నఁడును చూడలేదు. ఈమె నిజముగ చాల సాహసురాలు. పదిమందిమగవారిని చంపిపుట్టిన" దనియాశ్చర్యముతో పల్కెను.

వారిరువురు నట్లుపోవుచుండగా, ప్రక్కనున్న పూలచెట్లలో దాఁగుకొనుచుండిన పద్మాలయ యను మనోరమ జ్యేష్ఠపుత్రిక యెదురుగవచ్చి రమేశునకు నమస్కరించెను. ఆమె యెనిమిదేండ్ల బాలిక. చక్కనిచుక్క. ముద్దుపలుకులతో "ఏమండీ! డాక్టరుగారు! మా నాన్నగారి కెట్లున్నది" యని ప్రశ్నించెను.

దారిలో రమేశునకును రవీంద్రునకు నీక్రింది సంభాషణ జరిగెను.

రమేశుఁడు "నీయభిప్రాయ మేమి ?"

రవీంద్రుఁడు "నాకేమియు తోఁచుటలేదు. ఆపిల్ల చెప్పినదానిని బట్టి చూచినచో మనోరమ యీకార్యము చేసినట్లులేదు."

రమే.— నాకు నట్లే తోఁచుచున్నది. కాని యామె యొకవేళ పిల్లను భయపెట్టి యెవరైన నడిగిన నట్లు చెప్పుమని చెప్పియుండలేదు గదా ?

రవీ:— లేదు. ఆమె ధీర. ఇతరులకు తెలియ జేయదు. ఎవ్వరిని నమ్మదు. తానే చేసిపెట్టుకొని గెల్చిన గెల్చును. లేకున్న తత్ఫలమనుభవించును.

"అట్లయిన మరెవ్వరు చేసియుందురు. ?"

"అదియే. నాకును గ్రాహ్యము కాకున్నది."

ఒకవేళ కమలాకరుఁడే యిట్లొనర్చి మనలను మోగించుటలేదు కదా ?"

"అది వట్టికల్ల. నీవొకింతసేపు మాట్లాడకుండుము. నాకిపుడేమియు తోఁచకున్నది. పద్మ, మనోరమ యావలకుబోయి యుండెనని చెప్పలేదా? అట్లయిన నామె కమలాకరుదగ్గరకే పోయియుండును."

"సరియే. అట్లయిన నాకింకొకయూహ పొడముచున్నది. మనోరమ తన్ను విడచినంతనే కమలాకరుఁ డచట నిలువఁబడి యుండును. అతఁడిదివరలో తమ లేఖలు బాగుగనుండెననియు, నొకవేళ నిప్పుడద్వారా వచ్చియుండవలెననియు చెప్పలేదా? మాటలునార్పుట కాతడు ప్రయత్నించి యుండవచ్చును. కాని సాధ్యము కాకపోవచ్చును. ఆమెంటనుచూచి జమీందారుఁ డీవలకు వచ్చియుండును. కమలాకరుడాతఁడు తన్ను జూచెననియు, తప్పించుకొనుటకు వీలులేదనియు గ్రహిం

ది యాతనిని తుపాకితో కాల్చి యుండవచ్చును. తారానాథుఁడు పడిపోయిన పిమ్మట కమలాకరుఁడు పారిపోయి యుండవచ్చును.

“హా! దైవమా! కాదు కాదు. అట్లు జరిగియుండదు. కాని నీవిల్లెవరితోడను పలుకకుము. ఈమాటవిన్నచో నిక నెవ్వరును నిజమును బైటబెట్టినను నమ్మరు.”

“అట్లయిన నిజమింకొకటి యని తలంతువా?”

“అట్లే యెంచుచున్నాను.”

“అట్లయిన మనోరమ పేల్చలేదని బాలిక చెప్పియుండలేదా?”

“నిజమే. కాని, యామె తన ప్రయత్నము కొనసాగి వివాహోద్యమమునుండి మరలింపఁగలిగినచో నూరకుండుటకును, లేకున్నచో నెట్లయిన వివాహమాపుటకై తన మగనిని గాల్చివేయుటకును యెవనినైన నచట నిలువబెట్టి యుండును. వాఁడామె విఫలప్రయత్నయగుట నెఱింగి పేల్చియుండును.”

“అట్లయిన వాఁడు చిన్నగుండ్ల నేల పేల్చియుండును?”

“వాఁడు తెలియక యట్లుచేసియుండును.”

“అట్లయిన శివసింగే హంతకుఁడని నమ్ముదువా?”

“నేను నమ్మెదను”

“నేను నట్లే తలంచుచున్నాను. కాని ప్రయత్నముచేసి కనుఁగొనవలెను. వాని సమ్మతించుట కష్టము.”

ఇట్లు మాట్లాడుచుండఁగనే వారు రమేశుని గృహము సమీపించుటయు వారిరువురును పడిపోయిరి.

పోటునకు వెలువనేమిలాభమని తలంచి యాతడు తనకు జయము నిశ్చయమని యూరటగల్గించుకొనెను.

అట రవీంద్రుఁడు తన కార్యము విఘ్నమగుట నెఱింగించుటకై కమలాకరుని జేరి సర్వము నెఱింగించెను. కమలాకరుఁడిఁక నిట్టివానివలన ప్రయోజనము లేదనియు, తానే మనోరమను కలిసికొని మాట్లాడినచో తనకు మేలుగలుగవచ్చుననియు నిశ్చయించుకొని, మాధవు నెట్లయిన నొడంబరచి నాఁటిరాత్రియే మనోరమను చూచుటకు పోదలంచెను. అందులకై రవీంద్రునడిగి నారెచ్చటనున్నదియు, వారియింటి గుట్టు మట్టులును, జమీందారుని దేహస్థితియు నెఱింగెను. పిమ్మట ఆనందను తానొకసారి మాట్లాడవలసియున్నది గావున రావలసిన దనికబురంపెను.

ఆ సాయంతనమే యానంద వచ్చెను. ఆమెతో కమలాకరుఁడు తా నొకపరి బైట కేఁగవలెననియు, మగల తెల్లవారులోపల తిరిగి రాఁగలననియు, నంగులకు తగు ప్రయత్నములను సల్పవలసినదనియు కోరెను. ఆనంద యిదివఱకే మాధవుని లోఁబఱచుకొని యున్నదగుటచే దానికి వలయు ప్రయత్నము లొనరించెను. మాధవుఁడు తనకిది యుపాయకరమనియు, నెవరైన నొకవేళ కర్మము చాలక కమలాకరుని చూచుట తటస్థించినచో తన గతి యేమి కావలసినదో యూహించుకొనవలసినదనియు, తన్నీ కార్యమునకు నిర్బంధింపవలదనియు పదింబదిగ ప్రార్థించెను. అంత వారొక యుక్తి పన్నిరి.

ఇదివఱలో తన శిక్షాకాలము పూర్తియైనను వెడలిపోకుండిన రంగస్వామి యారాత్రి వెనుకప్రక్కగోడ కొకకన్నము త్రవ్వి పారిపోవలసినదనియు, దానికి ఖర్చులకై వేయిరూప్యములు కమలాకరుఁడొసఁగవలసినదనియు, వాఁడు చేసినత్రోవనే కమలాకరుఁడు బైటకేగి తేఁ పనిని నిర్వర్తించుకొని తిరుగ చెఱసాలలోనికి రావలసినదనియు నేర్పాటు గావించిరి. అవసరమైనచో రంగస్వామి పారిపోయినట్లు చెప్పవచ్చుననియు తలంచిరి.

వలసిన పనిముట్లు మాధవుఁడు తెచ్చి యీయఁగా గోడకు మనుష్యుఁ డొకఁ డవలీలగా పోవుటకు తగినంత కంతచేసి రంగఁడును కమలాకరుఁడును బైటఁ బడిరి. రంగని వీడ్కొని కమలాకరుఁడు మనోరమాగృహాభిముఖుఁడై పోవుచుండెను. రంగస్వామియు వాతఁ డెచటికి పోవునో చూడఁ దలఁచి వాని వెన్నంటియే పోవుచుండెను

---

## ౭వ ప్రకరణము.

### ధనపురేశుని పరీక్ష

చెఱనుండి వెలువడిన కమలాకరుఁడు పరులు తన్ను గుర్తింపకుండునట్లు మొగమునపై సన్నని వస్త్రము నొకటి కప్పుకొని, యూరి చివరనున్న సందులలోఁ బడి ధనపురేశుఁడు క్రొత్తగా విడిసియున్న మందిరమును సమీపించి తలుపు తట్టెను. అంత నొక పనికత్తె వచ్చి తలుపు తెఱచెను. ఆమె యిదివరలో కమలాకరు నెఱుంగదు.

"జమీందారుగారు గృహమందున్నారా?" యని కమలాకరుఁ డడిగెను.

"ఉన్నారు. జబ్బుగానుండుటచేత నెవరికిని కనబడరు. అమ్మగారు నంతియే"

"అమ్మగారిని చూచితీరవలెను"

"అది వీలు కాదు."

"నీవు పోయి కమలాకరుని నేరము విషయమై కొన్ని సంగతులు తెలిసికొనుటకు మేజస్ట్రేటుగా రెవరినో పంపినారనియు, నొకమా రాతఁడు మాట్లాడక తీరదని చెప్పుచున్నాఁడనియు చెప్పుము."

"అట్లు మొదటనే చెప్పకపోతివా?" యని యాతని వెంట

సిడుగొని పోవుచున్నగాని తలుపు తెరచుట సూరవసామే సహకర్తె నాటికి పోయెను.

ఇంతవఱకు కమలాకరుఁడు తలఁచినట్లు జరిగెను. ఇఁక మనోరమాసందర్శనము నిశ్చయముగా లభించును. ఈ కార్యము శీఘ్రముగా నెరవేరఁగలదు. అతఁడు చేయవలసినది మనోరమ తన్నుఁ జూడఁగనే విడలిపోవకుండ చూచుకొనవలసియుండెను. దైవానుకూలముగ తలుపు గదిలోనికి తెరచుకొనియుండెను. కమలాకరుఁడు తలుపువెనుక నే మనోరమ లోనికి ప్రవేశింపఁగనే తలుపు వేయుటకు సిద్ధుఁడై యుండెను.

ప్రొద్దుటినుండియు నాతఁడు తా నామెదగ్గర యెట్లు నడచుకొనవలెనో నిశ్చయించుకొనెను. కాని యిప్పు డాధైర్యమంతయు నెకమారు గాలివలె వదలిపోవుచున్నట్లుండెను. అతనిదేహము వణఁకసాగెను. గుండెలు కొట్టుకొనుచుండెను. అతని కా గదియంతయు చలింపుచున్నట్లు తోఁచసాగెను. మనోరమ వచ్చుటకు పదినిముసము లాలస్యమాయెను. ఆకాల మాతనికి పదినిముసములు పదియుగములుగ నుండెను. ఇట్లాతఁడు వేదన పొందుచుండఁగనే యడుగులచప్పుడు వినవచ్చెను. ఇంతలో జమీందారిణియు లోనఁ బ్రవేశించెను.

ఆమె కొన్ని యడుగులు లోనఁ బెట్టి గదిలో తనకొఱకై వచ్చిన యాతఁడు కనిపించకుండుట కాశ్చర్యపడుచుండెను. కమలాకరుఁడు తలఁచినట్లయ్యెను. అతఁ డొకమాటుగ తలుపులు మూసి వైచి;

"మన మిప్పు డిరువురము మున్నాము" అనియెను.

ఆమె యాశ్చర్య భయ సంభ్రమాన్వితయై "కమలాకరా!" యని యఱచి, పాఱిపోవుటకు ప్రయత్నించెను; కాని లాభము లేకపోయెను. అచట నొక కిటికీ తెరచియుండ నందుండి పోవుట కామె యచటికి పరుగిడెను. కమలాకరుఁ డామె వెన్నంటి,

"నీ వింక పారిపోజాలకుము! ఒకవేళ నట్లు చేసినచో నేను నీవెనుకనే నీమగని దగ్గర కైనను వచ్చి తీరెద" నని బెదరించెను.

ఆమె వెఱ్ఱిచూపులు చూచుచు "నీవా? యిచటికి వచ్చితివా?" యనియె.

"ఔను నేనే యిచటికి వచ్చితిని. నీవు పాపము కమలాకరుఁడు చెఱసాలయందు బంధితుఁడై యుండుటచే మన కేయపాయమును వాటిల్లదనియు, నింక కపటనాటకము సాగింపవచ్చుననియు, నేరము నీవు చేసినను నేను నీ కిదివఱలో చేసినద్రోహమునకు నాపై పగ దీర్చుకొనుటకు నాపై నేరముస్థాపించి శిక్షాపాత్రునిఁగఁ జేయవచ్చుననియు, నిజముగ నేను నిర్దోషినైనను నాకీశిక్ష తప్పదనియు ధైర్యముతో నుంటివి కాబోలు! కాని "తా నొకటి తలంచిన దైవము వేరొకటి తలంచు" నన్నట్లు నేనిచటికి రాఁగలిగితిని. ఇఁక నెందు బోఁగలవు?"

ఈమాటలు వినినతోడనే యామె మొగము వైవర్ణ్యత నొందెను. ఆమె యసూయతో

"ఇదియంతయును రాక్షసకృత్య" మనియెను.

"రాక్షసకృత్యము కాక మరేమి?"

"పరమద్రోహీ! మహాపాతకుఁడా!"

అతఁడు వికారమైన నవ్వు నవ్వెను. "నీవా! నేనా! నీవట్లనెదవా?"

కష్టముతో ధైర్యము తెచ్చుకొని మనోరమ "ఔను. నేనే యిట్లు నిన్ను పిలుచుచున్నాను. నీ నేరమును నీవు కాదనజాలవు. న్యాయాధీశులైనను కనిపెట్టఁజాలని నీయుపాయములను నేను కనిపెట్టినాను. నీవు, నేను నిన్ను భయపెట్టినప్పుడు నేనట్లు చేసివైతునని భయపడినావు. "ఇఁక నంతయు నయిపోయినది, ఈమె యొట్లయిన మగనితో

చెప్పితిగ" వని తలంచి నేను లోనికేగగనే నామగడు బైటకు వచ్చునట్లు కడ్డిమేటి నంటించితివి కనుక ద్రోహివి. తరువాత పైకి రాగనే తుపాకిని గాల్చితివి గాన మహాపాతకుడవు" అనెను.

అతడు మరల నవ్వెను.

"ఇదియానీయూహ? ఇదియెవ్వరైనను నమ్మగలరని తలంచితివా? నీ మనశ్శంకలన్నియు కాలిపోయినవి. నీవిదివరలో నాతో సంబాధము గలిగియుండలేదని చెప్పినచో, నేను నీ కాముకుడను కానని చెప్పలేనా? ఇంక నీవు నీమగనికి చెప్పినను, నాకేమియుపాయము రాగలదు? ఏమియులేదని నీకు తెలిసియే యున్నది. మనయాచారములను బట్టి స్త్రీల కవమానము గూర్చునదియే కొన్ని సమయములలో పురుషునకు యశము దెచ్చును. ఇంక నేను నీభర్తను జూచి భయపడుచుండుటకు, నేనొకరికి జడియువాడను కానని లోకమెఱుగును. నేనొకవేళ భయపడినను, మనమిరువురమును సీతాసదనములో కలిసికొనుచుండిన సమయమునందైనచో నట్లు జరుగవచ్చును ఏలయన? మనచట్టము ప్రకారము నీభర్త న్యాయశాస్త్రమొకచేతను, తుపాకి నొకచేతను గొని, హఠాత్తుగ మనముండిన స్థలమునకు వచ్చినచో నాతడు నాపై పగదీర్చుకొనుటకు వీలుండి యుండును. మనపాతచట్టము నేరస్థురాలగు తనభార్యను, భర్త నేరము జరుగుచుండగా పట్టుకొనినచో నాతడే శిక్షవిధించుటకు సమ్మతింపుచున్నది. ఆకారణమున జేసి యాతడు మనల నిరువురను మృత్యుదేవత కాహుతిగ జేసియుండ గలుగును. కాని, యిపుడట్టి భయమునకు కారణము లేదుగదా? కనుక నీమాటలకు భయపడు నంతటి యాడుదానవా?"

ఈమాటలు విన్నపుడామె యించుకైన చలింపక ధైర్యముగ నుండెను. ఆమాట లాతని నిర్దోషిత్వమును, సత్యస్వభావమును వినువారికి వెల్లడింపుచు, ములుకులవలె నాటునట్లుగ నుండెను.

మనోరమయు "ఇట్లు జరుగగలదా? ఎవరైన నిట్లనుకొనగలుగుదురా?" యనిగొణుగుకొనుచు, ధైర్యము తెచ్చుకొని "నాకు మతిస్థిమితము పోవుచున్నది. నీవు చేయకుండినచో నీకార్యము నెవరుచేసియుందురు." అని ప్రశ్నించెను.

కమలాకరుఁ డామెచేయిని గట్టిగ పట్టుకొని చెవిలో మెల్లగ "దుర్మార్గురాలా! నీవే!" యనిపల్కి, యామెను ప్రక్కనున్న కుర్చీలో పడునట్లుగ నొకతోపు త్రోసి "భర్తృహీనవై, నాకార్యము కొనసాగింపకుండఁగ జేయు తలంపుతో నుండిన నీవే యీకార్యమును జేసితివి. మనము మొదటిసారి కలసికొన్నప్పుడు మూర్ఖుఁడనై నీవు నిజముగ విచారముతో నుంటివని యూరార్చుటకు నీవు భర్తృసహితవు గావున మనకు వివాహము సంఘటింపజాలదనియు, నాకారణమున నానందను వివాహమాడెదననియు పల్కితిని. అపుడే నీవు "హా! దైవమా! నాకాయూహ తోఁచియుండిన నెంత బాగుండెడిది" అని విచారించితివి. నిజము చెప్పుము! ఆయూహ యేమి? ఇదియేకదా?" యని ప్రశ్నించి, భావగర్భితముగ "నీవు నేరస్థురాలవు గాకుండిన నీక నెవ్వరై యుందురు?" అని ప్రశ్నించెను. ఆమె యాశ్చర్యముతో తాను కూర్చుండినచోటనుండి లేచి "నిజముగ నీవు చేయనే లేదా? అట్లయిన నేనే చేసితినని నమ్ముచుంటివా?" యనియె.

"నీవు చేసియుండనిచో, బహుశః చేయించియుందువు." ఆమె యదివినినతోడనె విచారముతో "హా! దైవమా! ఈతఁడు నిజముగ నేను నేరస్థురాలననియే నమ్ముచున్నాడు." అనిదీనముగ పల్కెను.

అపుడు, పిడుగులు పడినపిమ్మట నాకసమంతయు నిశ్శబ్దమగునట్లు శాంతదేవత యొకమాఱు వారినిరువురనావహించెను. వారిరువురు నొకరి నొకరు చూచుకొనుచుండిరి. వారి మానసములయం

దేమియు తోచకుండెను. ఇరువురును నిజస్థితి గ్రహించిరి. వారి ననుమానభూతము వదలిపైచెను. ఇరువురును తాము నిర్దోషులమని గ్రహించిరి. తామిదివరలో తప్పటభిప్రాయములం దుంటిమనియు గ్రహించిరి. ఇది వారి మానసములను భావరహితములుగ జేసివైచెను. ఒకరునుగూడ నిజమగు ద్రోహి యెవఁడో గ్రహింప లేకుండిరి.

"ఇపుడేమిచేయనగు"నని మనోరమ ప్రశ్నించెను.

"నిజము చెప్పివేయవలెను"

"ఏమిటది?"

"మనకిరువురకును సంబంధముండెననియు, నారాత్రి మన యేర్పాటు ప్రకారముగ నానంద భవనమునకు వచ్చియుంటిననియు, నచట దొరికిన తూటాగొట్టము నాచే నిప్పు రగుల్కొల్పుట కుపయోగింపబడెననియు, మన ప్రణయలేఖలను కాల్చివేసిన ముక్కలను పారవేయుటకు ప్రయత్నించుటచే నాచేతులు నల్లవడియెననియు చెప్పివేయవలెను."

"అట్లెన్నడును జరుగకూడదు" అని నిశ్చయముగ మనోరమ పల్కెను.

"అట్లు జరిపి తీరెదను. ముమ్మాటికి వెల్లడిచేసెదను"

"కూడదు. కూడదు" అనిపల్కుచు కమలాకరుని మాట్లాడనియకుండగనే,

"నిజము చెప్పుటకు వీలులేదని నీకు తెలియుట లేదా? సత్యము చెప్పినను మననిర్దోషిత్వము నెవ్వరును నమ్మరు. వారు మనలనిరువురను తోడిదొంగలని మాత్రము తలంతురు."

"ఏమైనను కానీ. నేను చచ్చుటకియ్యకొనెను"

"అట్లు చెప్పకుము"

"అదియే చేయుచున్నాను."

"అంతయు చెప్పివేసినను దానివలన నీ కేదియు లాభము లుగఁజాలదు. కాని, నాకుమాత్రము కీడు సేయఁగలదు. అదియా నీవువాంఛించునది? నీతోపాటు నేనుకూడ నధోగతి చెందినచో నీకు మాత్రమేమి లాభము? దీనివలన నీకు శిక్షతగ్గునా? బాధతగ్గునా?

అతఁడామెను దారుణభావముతో చూచుచు, "ఇంకనునీ వ్రయత్నములు మానవా? నేనధోగతి చెందబోవుచున్నాను. చావునకు సిద్ధుఁడనై యున్నాను. ఇట్టిసమయములో నాతో బేరము లాడు చుంటివా? ఇదివరలో నన్ను ప్రేమించితి నన్న దానవు నేఁడిట్లు పల్కుచుంటివా? స్త్రీలెంతటివారలు! వారిని నమ్ముట మూర్ఖతయే తప్ప వేరుకాదు."

"నేను బేరము లాడుచున్నానా? సరియే. వినుము. నిజముగ నేను బేరములే యాడుచున్నాను. ఇయ్యది నాకీర్తికి భంగముగల్గించును. జీవముకన్న మానమునే యెక్కువగఁజూచుకొనుచున్నాను. కాని మానప్రాణములకన్నను, నిన్నెక్కువగఁ జూచుకొనుచుంటిని. నీవిపు డధోగతి చెందుచున్నావని పల్కుచున్నావు అట్లయినచో మనమిరువురము నీదేశమునువదలి పారిపోవుదము. నీవొక్క మాట —సరియే—యనినచో, నేను నా సర్వస్వమును, గృహమును, భర్తను, పిల్లలను, కీర్తిని, సమస్తమును, విడిచి రాఁగల యున్నాను. నీ వా యొక్కమాటను పల్కుము. నేను. వెనుదీయక, విచారింపక, మాటాడక కాలవ్యవధి లేకుండఁగ, నీవెంట వచ్చెదను"

ఇట్లు పల్కునపుడు గాలిచే కదలు లతవలె, నామె దేహ మంతయు కంపించెను. కనుల పూర్వతేజమును వెలువరింప సాగెను. రోమాంచములు గగుర్పొడిచెను. కేశపాశము విడెను. పెటపెటరాలెను. పాలవలె నామె దేహచ్ఛాయ బయట పడెను, గద్గదస్వరముతో

ప్రేమపూరస్కృతములగు చూడ్కులతో, దయార్ద్ర హృదయము తో, విచారభాగముతో నిట్లు పలుక సాగెను

"ఇక మన కేమి యభ్యంతరము! నీవు చెఱసాలనుండి బైటబడితివి. ఇక మనకు కష్టము లీడేరెను. నేను మొదట మనపిల్లను—నీసంతానమును—కూడ దీసికొని రాదలంచితిని. కాని, యామె చాలజబ్బులోనున్నది. మరియు పిల్లయున్నచో మనగుట్టు బైటపడవచ్చును. మన మిరువురమే యైనచో మనల నెవ్వరును కనుగొనజాలరు. మనకు కావలసినంత ధనమున్నది. పురాణములలో వర్ణింపబడు నానాసౌఖ్యవంతములగు దేశములకు పోవుదము. అచట, నాదూర దేశములందు నిర్విచారముగ, నిర్వికారముగ, నిశ్చలముగ, నిరంకుశముగ, నిర్నిరోధముగ, నిర్వ్యాజప్రణయముతో బంధు, మిత్ర, శత్రు, బాధలు లేకుండ, నెవ్వరును తెలిసికొనజాలకుండ, నితరులెఱుంగకుండ, నిరంతర కేళీ విలాసములతో మనజీవితము గడపుదము. ఇక నేను బేరములాడుచుంటిననజాలవు. నేనింక నీదానను. నీభార్యను. నీదాసిని నీసహధర్మచారిణిని. నీవిక నాసర్వస్వమవు, కర్తవు పోషకుడవు. భర్తవు, మానము, ప్రాణము, సుఖము, దుఃఖము, అన్నియు నీవే. నీబాధ లేనా బాధలు. నీ సౌఖ్యమే నాసౌఖ్యము. నీవే నేనుగ వర్తింపుదము" శిరము వెనుకకు వాల్చి, యరమోడ్పులగు నేత్రములతో నాతనిపైకెత్తిగి "చెప్పుము. కమలాకరా ' సరియే. చెప్పు"మని దీనముగ ప్రార్థించెను.

అనడామెను భుజములనంటి ప్రవరాఖ్యుని చందమున వెనుకకు గెంటివైచెను. పారిపోవుదమనుట యాతని కసహ్యముగదోచెను. "చావైన పారిపోవుటకంటె మేలే" యనియెను

ఆమె నిశ్చేష్టయయ్యెను. కత్తివాటు వేచిన నామె మొగమున నెత్తురుచుక్కయున్న మాట లేదు, నేత్రద్వయము తేజోవిహీనమయ్యెను. తనూలత వసివాడెను. ఇంతలోనన మెఱుపువలె నామె నో

కయాగ్రహభావ మావహించెను. "భంగుననామెకడుగిడి" ననుగేల కోరదవని" యడిగెను.

"నన్ను రక్షించుటకై నీసాహాయ్యము."

"అట్లయిన నాగతియేమి"

అతఁడేమియు బల్కలేక. ఆమె, యిదివరకెన్నఁడు నత్యంతవినయాన్వితయైనది గాయము నదీర్ఘముగఁజేసి, కరమసూయాభావముతో నిట్లు బలుకసాగెను.

"అనఁగా, నీవు నీసౌఖ్యముకై, నాప్రాణమును, మానమును ధారవోయుమనెదవు. నీకొఱకు! అంతియగాక, ముఖ్యముగ నీకుఁ గాఁబోవుభార్య యానందకొఱకు! ఇదంతయు సులభమగు సంగతి యని తలంచెదవా? నేను నీకొకప్పుడు ప్రాణాధారమును, ఇపుడసౌఖ్యకారణమును, హేయముగుదానను. ఆమె యిపుడు నాస్థానమాక్రమించియున్నది. ఆమెయే నీసౌఖ్యములకు మూలమును, ప్రాణపదమునైయున్నది. పూర్వము ప్రేమపాత్రమగు నేను, నీ నూతనవధూసౌఖ్యమునకు సోపానములు కాఁగోరుచున్నావు. నీవామె గౌరవమునకై నామానహానియైన నాలోచింపవు. ఆమె ప్రేమామృతపూరితమగు చిఱునవ్వునకై నాదుఃఖసముద్రమునైనను లెక్కసేయవు. కల్ల! కల్ల! అట్లెన్నటికిని జరుగదు. నీనూతనవధువు నీతో సౌఖ్యమునొందుటకు నన్ను రక్షింపుమని కోరుట మూర్ఖత్వము. నీవు నాదానినంతయు, నామెకొఱకై కోలుపొమ్మనుట వెఱ్ఱి. ఆమెనుండి నిన్ను గ్రహించుటకై నేనంతయు వీడెదనుగాని, నిన్నామెకు సమర్పించుటకు మాత్రమట్లు చేయనని యెఱుంగుము."

"పాతకీ!" యని కమలాకరుఁ డఱచెను.

ఆమె యాతని నిర్లక్ష్యభావముతో చూచెను. ఆమె కనులనుండి క్రౌర్యము వెలిగ్రక్కుచుండెను.

"నీకింకను నాసంగతి పూర్ణముగ గ్రహింపఁజాలేవు. నీచేత నైన ట్లు నన్ను తూలనాడుకొనుము. పొమ్ము. నీవెంత ప్రయత్నించినను, నేనెట్లు నానిర్దోషిత్వమును స్థాపించుకొనగల్గుదునో నీన్యాయవాది రవీంద్రుఁడే యిదివరలో చెప్పియుండ వచ్చును"

అసూయాపరవశుఁడై, యాగ్రహావేశుఁడై, వివేక హీనుఁడై, కమలాకరుఁడు చేయిసాఁచి మనోరమను కొట్టబోవుచుండ నింత లో "ఆస్త్రీ నంటకుమీ" యను యొక వాక్కు వినవచ్చెను.

మనోరమాకమలాకరు లిరువురును వెనుకకు దిరిగి చూచి యొక్కకేక వైచిరి. ద్వారమున నొకచేత పిస్తోలును ధరియించి, కాల్ప నుద్యుక్తుఁడై ధనపురేశుఁడు నిలచి యుండెను.

అతఁడు శవమువలె కళావిహీనుఁడై యుండెను. అతడు ధరించిన తెల్లదుప్పటము జీరాడు చుండెను.

మొదట మనోరమ యరచినయరపు చావనుద్యుక్తుఁడై పడకపై బరుండియుండిన యాతనికి వినబడెను అతనికేదో తోచెను. సత్వ విహీనుఁడై యుండియు, నెట్లో లేచి నెమ్మదిగ ప్రాకులాడుచు, వీరిరు వురును నిలచియుండిన గదిని సమీపించెను. వీరిసంభాషణమంతయు సాంతముగవినెను. కమలాకరుఁడు దౌర్జన్యము సేయుచుండగ తలుపు సందులో నుండి చూచుచున్నవాఁడగుటచే, తలుపు తెరచి లోన బ్రవే శించెను.

"నేనంతయు వింటి" నని వారిరువురు నణగఁద్రొక్కునట్లు తీక్ష్ణ ముగ జూచెను.

మనోరమ విచారసూచకమును, దీర్ఘము నగు నిట్టూర్పువిడచి దగ్గరనున్నకుర్చీలో కూలబడెను. కమలాకరుఁడు సహజముగ ధైర్య శాలియగుటచే నెట్టకేలకు "మీకు చాల ద్రోహముచేసియున్నాను. మీపగదీర్చుకొనుఁ" డని పల్కెను.

"న్యాయస్థానమే నిన్ను శిక్షించు" నని ధనపురేశుఁడు పెల్లగ పల్కెను. "హా! దైవమా! అట్లయిన నే నెన్నఁడును చేయనిదుష్కార్యమును చేసినట్లు స్థిరపరచెదవా? అంతకన్న నీచమేమున్న" దని కమలాకరుఁడు వాపోయెను.

"అది యెంతనీచమా? అట్లయిన నితరునిభార్యను రహస్యముగ చెఱచి, దొంగిలించి, పిల్లల ననాథలనుగ జేసివైచి, పారిపోవనంపిద్ధుఁడైన ఛండాలునికంటె నీచతముఁడెవఁడు? నిజముగ నీవు నిర్దోషివే. కాని నామానసమునందు రగుల్కొనిన యగ్నికంటె వేగగ్ని యెక్కడనున్నది? నాహృదయమును ఛేదింపజాలు నాయుధముకంటె వేరాయుధ మెక్కడనున్నది? నాసౌఖ్యమును, మానమును, సకలమును, జెఱచుటకంటె, నాగృహమును, ధనమును చెఱచుట యెక్కడా? ఇంతికార్యమునఁ గొడంబడిన నికంటె ద్రోహియెవ్వఁడుండనోపు? తప్పక న్యాయస్థానమే నాపగదీర్పుటకు తగినది." అనియె కారానాథుఁడు.

కమలాకరుఁడు భయకంపితుఁడయ్యెను. అతనికండ్లకుగట్టినట్లు తనిముందు తనభావిస్థితి గన్పట్టెను. "చావైనమేలే" యనియఱచెను. "చావైనను త్తమమే" యని హృదయమువైపునకుచూపుచు "ఏల నీ వాతుపాకితో నన్ను పేల్చవు? నన్నేల కాల్చివేయవు? నీకు రక్తపాతమనిన జంకా? చంపుము. నన్ను చంపివేయుము. నీభార్యను చెఱచితిని. ఇట్టివానిని తెగటార్చుట కేల వెనుదీసెదవు? ఆలస్యము వలదు. చంపుము"

జమీందారు పిస్తోలును క్రిందకుదింపెను.

"న్యాయస్థానమే నీకు తగినశిక్ష విధింపగలదు. నీవు నాయశమునకు కళంకముదెచ్చితివి. నేను నీయశమును హరించెదను. నిన్ను శిక్షింపదగినంత రుజువు లేకున్నచో, నేను నిన్ను స్పష్టముగ జూచితినని చెప్పివైచెదను. నీవే నేరస్థుఁడవని పల్కితీరెదను. ఇదియే నాదృఢ

ప్రతిజ్ఞ. నిన్నిట్లు ఘన సన్మానము పాలుగావించి యురితీయించెద" నని చెప్పివేసెను.

ఇట్లు చెప్పి సూతుఁడు ముందునకు రాబ్రయత్నించెను. కాని యా సంరంభము చేతను, కష్టము చేతను, రోగపీడితుఁడగుట చేతను, సత్త్వవిహీనుఁడగుట చేతను, పడిపోయెను. కమలాకరుఁడును పరుగెత్తిపోయెను.

---

## 8 వ ప్రకరణము.

### దయ్యములు

రాముడు "ఓహో! శంకరా! ఎక్కడనుండి వచ్చుట?"

శంకరుఁడు "నాలుగుదినములక్రితము బంధుగులయింటికేగి తిరిగి వచ్చుచున్నాను."

"అంతా క్షేమమా?"

"క్షేమమే. విశేషము లేమి?"

"ఇంకను వినలేదా? కమలాకరరాయలు నిన్నటిరాత్రి చెఱనుండి తప్పించుకొనిపోయినాఁడట. ఊరిలో నెక్కడజూచినను యీ వార్త చెప్పుకొనువారే"

"ఛీ! అది నేను నమ్మను. అతఁడెందుకు పారిపోవును?"

"లేదు లేదు. నిజముగా పారిపోయినాఁడు. మన వెంకటాద్రి రాత్రి యేదో పనిమీద పోవుచు నాతని జూచినాడట. ఊరిలో నెచ్చటనుయీవార్తయే. కమలాకరుఁడు నిలువకుండగ పిచ్చివానివలె పరుగెత్తిపోయినాడట."

"అతఁడు కాకపోవచ్చును. చీకటిలో జూచి వెంకటాద్రివట్లు తలంచి యుండవచ్చును."

# ద్వితీయ భాగము.

"కాదు; కాదు. చిన్ననాటినుండియు చూచుచున్నవానినే గుర్తింపజాలడా? నీదేహమును నీవు మరచెదవన్నట్లు చెప్పుచున్నావే"

"నిజము నిలుకడమీద తేలును. నాకు పనియున్నది. నేను పోయెదను." అనుటయు వారిరువురును తమదారిని తాముపోయిరి.

ఆనాటియుదయ మెచటజూచినను కమలాకరునిగూర్చియే విన్పించుచుండెను. ప్రజలు గుంపులు గుంపులుగ జేరి వీధియందు మాట్లాడుకొనుచుండిరి. కొందరు జైలుఖానదగ్గరకు పోవుచుండిరి. చెఱసాలయొద్ద జనము కిటకిటలాడుచుండెను. అచట నాయూరిప్రముఖులందరు జేరిరి. నరేంద్రుడు, నవీనుడు, వారు వీరననేల పాటలీపుత్రములో జనులు సగముపైగా నుండిరి. ఎల్లరును ముక్కులపై చేతులు వైచువారే.

రవీంద్రుడుదయముననే లేచి మొగము కడుగుకొనుచుండగా నానందభృత్యుడొకడువచ్చి తనయజమానురాలొకమారాతనిని దోడ్కొని రావలసినదిగ చెప్పెనని తెలియజేసెను. రవీంద్రుడును శీఘ్రముగ తనపనిని ముగించి, వానివెంట నేగను దారిలో పెక్కండ్రతనిని పలుకరించినను మాట్లాడకయే పోయి గమ్యస్థానముచేరెను.

ఆనంద యాతనిలోనికి గొంపోయినంతనే "ఏమిటి, ఈయపవాదు? " అని ప్రశ్నించెను.

"నిజమే. కాని, కమలాకరుడు పలాయనముగుట కల్ల. నిజముగ నాతడు ద్రోహియై యున్నచో నాతడట్లు చేసియుండునని యనుమానింపవచ్చునుగాని, సద్గోష్ఠియైన యాతడిట్లు చేయడు."

"అతడు రాత్రి యెచటికేగెనో తెలియునా? "

"తెలియును"

ఆమెముఖము, ధరించినచీరవలె తెల్లనై యుండెను. విచారము

"అతడు తానిదివరలో ప్రేమించినయామెను చూడబోయి యుం

మును. ఆమె నన్ను వివాహముచేసికొనకుండుటచేత నెట్లైన నామెను లోబరచుకొనుటకు వెళ్లియుందును.”

“ఆవిషయములో మీరనుమానించిన యవసరము లేదు. మనోరమ యిట్టిగాఢతరమగు వలపుగలిగియుండజాలదని నేను దృఢముగ చెప్పగలను.”

ఈమాట విన్నతోడనే యానంద యాశ్చర్యపరవశయై ప్రక్కనున్న సోఫాపై కూలబడెను. కొంతకాలమునకు. “మనోరమయా” యని ప్రశ్నించెను.

రవీంద్రుడు తానొనర్చినతప్పును గ్రహించెను. అతఁడిదివరలో కమలాకరుఁడామెకు, తనపూర్వవృత్తాంతము చెప్పియేయుండునని తలంచి యిట్లుపల్కెను. కాని, నాలుకజారినపిమ్మట తప్పునుగ్రహించినను కార్యములేదుగదా? చేయిజారినపిమ్మట నాకులబట్టినచో నేమిలాభము.

“మనోరమయా! ఇదివరలో నెల్లరిచేతను పతివ్రతాశిరోమణియని పొగడ్తగనుచున్న యామనోరమయేనా? మొన్నటి సాయంకాలము మేము దేవాలయములోనికి పోయినపుడు నేనామెను జూచితిని. ఆమెభక్తి యాశ్చర్యము గల్పించదే? ఆహా! ఎంతటిసంగతి” యని యానంద పలుకజొచ్చెను. రవీంద్రుడు “అమ్మా! నేను చెప్పకూడనిసంగతి ప్రమాదవశమున చెప్పివేసినందులకు నాయీతప్పును జన్మముండినంతకాలమును మరువజాల” నని పశ్చాత్తాపతప్తుడై పల్కెను. ఆమె విన్న మొగముతో లేనినవ్వు తెచ్చుకొని నవ్వెను. “సరిలే. ఈమాటయిట్లుంచి ప్రస్తుతపుసంగతి విచారింతము. జరిగిన సంగతినంతయు కనుగొనిరం” దని యాతని వేడ్కొనియుండెను.

రవీంద్రుడు పదియడుగులైన నడువకుండగనే యాతని నెఱింగిన యొకపెద్దమనిషి “ఏమండి రవీంద్రుడుగారూ! మీకమలాకరుఁ

డు పారిపోయినాడట. నిజమేనా?" యని ప్రశ్నించెను. రవీంద్రుఁడు "వట్టిది. అది యెన్నటికిని జరుగజాల"దని యుత్తరమిచ్చెను "అట్లు జరిగినదండి. నేటియుదయమున మూరఘుని భార్య దూడగడ్డికయి పాతకోట సమీపమునకు పోయినదట. అంతనామె యీసంగతి ప్రతివారికిని తెలియజేసినదట. అచట జయిలుగోడకు కన్నము వేయబడియున్నదట. పోలీసువారువచ్చి యీసంగతి మేజస్ట్రీటుగారితో చెప్పిరట. వారందరును పోయియున్నారు"

"సరిసే. చూతు"మని రవీంద్రుఁడు వెడలిపోయెను. దారిలో పెక్కండ్రతనిని ప్రశ్నింపజొచ్చిరి. కాని వారిని సరకు చేయకయే రవీంద్రుఁడు చెఱసాలను సమీపించెను. అచటననేకులు గుమిగూడియుండిరి. మధ్య రమేశుఁడు ముఖర్జీ ప్రముఖులు నిలచియుండిరి.

ముఖర్జీముఖము విన్నబోయియుండెను. అతఁడీసంగతి విని పరమసంతోషముతో తనకార్యము సఫలతనొందగలదుగదా యని గంపెడాసతో వచ్చెను. కాని పాపము! వానితలంపునకు వ్యతిరిక్తముజరిగెను. కమలాకరుఁడు చెఱసాలనుండి పారిపోవుటకుబదులు చెఱసాలయందు తనశయ్యపై సుఖనిద్రించుచుండెను. పారిపోయినది రంగస్వామిగాని కమలాకరుఁడుకాఁడు. ఇంతలో రవీంద్రుఁడు ప్రవేశించెను. ఇతని చూచినంతనే ముఖర్జీముఖము పీతకళవహించినట్లయ్యెను. రవీంద్రుని జూచి యాతఁడు,

"ఏమివిశేషములు? కమలాకరునిగురించినవార్త నిజమా?" యని ప్రశ్నించెను. కాని రవీంద్రుఁడుమాత్రము మీపాటి చాకచక్యము లేనివాఁడా? అతఁడు "అట్లెన్నటికిని జరుగదు. కమలాకరుఁడు తాను జయముగాంచగలనని పూర్ణముగ నమ్మియున్నాఁడు. అతఁడేల పారిపోవును?" అనెను. ముఖర్జీ మాట్లాడకుండగనే రమేశుఁడు "నిజమే. కమలాకరుఁడు తనశయ్యపై సుఖముగ నిద్రించుచున్నాఁడు." అనెను. అంత రవీంద్రుఁడు సెలవుగైకొని కమలాకరునితో మాట్లాడబోయెను.

అతఁడు లోనికేగగనే కమలాకరుఁడు అడుగులచప్పుడు విని లేచెను. వానిని జూచినంతనే గొప్పయాపద తటస్థించినట్లుగ రవీంద్రుఁడు గ్రహించెను "మరల విఘ్నమే తటస్థించెనా?" యని ప్రశ్నించెను

"ఆహా! 'ప్పయాపదయే. మనప్రయత్నములెల్ల వమ్మగును" అని జరిగినసంగతినంతయు చెప్పివేసెను.

"నిజముగ నీవనినట్లది గొప్పయాపదయే. జమీందారే యిట్లు సాక్ష్యమిచ్చుచో నిఁక మనకు శిక్ష తప్పదు." "నిజమే, కాని, వానినేవిధముగను నిందింపజాలము. సర్వసాధారణముగ భర్తలాత్మగౌరవమునకై భార్యలనడనడిని చక్కబెట్టుకొందురు. అట్టివారికి భార్యలు దుష్ప్రవర్తనము సాగించినచో వారికి పైవిచారమెగాని, మనసులందుండదు. ఇక నీనిసంగతి యిట్లుగాదు అతడామెను త్రికరణశుద్ధిగ ప్రేమించెను; అట్టికూరిమిసతి తనకు ద్రోహము చేసినదన్న సంగతి తెలియగనే హృదయము ఛేదింపబడెను. కనుక నాతడట్టి కార్యమునైన చేయఁగలఁడు. అతఁడామెయే తనకు సర్వస్వమని తలంచెను. నేనామెను పాడుచేయుట వానిసర్వస్వమును నాతనిని వీడిపోయెను. అతనిప్రాణములలో ప్రాణమైనభార్య వానిని పరిత్యజించెను; ప్రేమాస్పదులలో మిన్నయగు చిన్నకూతురాతనికి జన్మింపలేదాయెను ఆహా! వాని దుఃఖము వర్ణింపనసాధ్యముగదా? నాకింతవరకును నిజముగ వ్యభిచారమనిన నేమో తెలియలేదు. కాని వానిమొగము జూచినంతనే, ఆహా! నాకంతయు గోచరమయ్యెను. వానితుపాకి యేల నాపై తనపనిచేయలేదు. నేనుచాల బాధనొందుచున్నాను. కాని వానిస్థితిలోనుండినచో నేనంతకన్న నెక్కుడేమి చేసియుందును?"

రవీంద్రుఁడు నిశ్చేష్టుఁడయ్యెను.

"తరువాత నేమి జరిగెను"దని ప్రశ్నించెను.

కమలాకరుఁడు రెండుచేతులతోను తనశిరస్సును గట్టిగ పట్టుకొని యూహాలన్నింటిని సమకూర్చుకొని యిట్లు చెప్పసాగెను.

"తరువాత పిచ్చివానివలె పరుగెత్తి యావలబడితిని. నే నేవిక్కు-లపరుగెత్తినది, యేవీధుల గడచితినదియు, నాకు తెలియలేదు. కాని నాకొక్కటి మాత్రము తెలియును. వీలయినంతత్వరలో సాధ్యమయినంతదూరము పోవలెనని మాత్రమే నాయూహ. ఇట్లుచాలవఱకుపోయిన పిమ్మట, నాకు మరల జ్ఞప్తివచ్చెను. చూచితిని. అప్పటికి పాటలీపుత్రము వీడి, సీతానదనము దాఁటిపెట్టితిని. మొదట నేనెట్లచటికి వచ్చితి నాకు తెలియలేదు. నైసర్గికమగునలవాటుచే నేనట్లుపోయి యుంటిని. నేను మరల నా, యీ, స్థానమునకు పోవలసినట్లు గ్రహించితిని. కాని చాలగనలసియుంటచే తిరిగి రాజాలనేమోయను భయముపుట్టెను; కాని యెట్లో చెఱసాల వైపునకు పరుగెత్తితిని. అప్పటికి రాత్రి రెండుగంటలయ్యెను. మాధవుఁడు నాకొఱకుచూచుచు దారిలో నిలచియుండెను. నన్నాతఁడెట్లో నచటికి జేర్చెను. నాశయ్యపై మేనువాల్చితిని. ఒకింతతడవులో నాకునిద్రవచ్చెను. నిద్రలో నాకు సంకెలలు వేసినట్లును. ఉరిత్రాడు మెడకుతగిల్చినట్లును, భయంకరముగ కలగంటిని. ఇప్పటికిని నాకాభయముతీరలేదు."

రవీంద్రుఁడు బాష్పపూరితుఁడయ్యెను. "అకటా" యనియెను.

"నిజమే. నేను నిన్నటిరేయి యిచ్చటికి రాకుండినచో నినటికి నాబాధలన్నియు విముక్తిగలిగియుండును. నేను నాగృహమునకేగి యీసరి కాత్మహత్య చేసికొని యుండువాడను"

"సీతలిదండ్రులో?"

"వారున న్ననుసరించియే యుందురు"

"ఆనందగతి యేమి?"

"ఆమెకొఱకే ముఖ్యముగ నేనట్లు చేసి యుండవలసినది. ఆమె చిన్నది. నేను పోయినను, కొంతకాలమునకు నన్ను మరచిపోగలదు. అట్లేకదా యెల్లవారును కొంతకాలమునకు తమదుఃఖమును మరచి పోదురు."

“కాదు; కాదు. అట్లెన్నటికిని జరుగదు. సామాన్యస్త్రీలవలె నామె నిన్ను మఱువఁజాలదు;”

కమలాకరుని కన్నులనుండి యశ్రులు జలజలవ్రాలెను. గద్గదికస్వరముతో “ఆమె సామాన్యులవంటిది కాదు. నేను పోయినచో నామె నన్ననుకరించును. కాని, ఆహా! నిజముగ నేను నేరస్థుఁడనని యురిశిక్షవిధించినచో, ఆమెవ్యథకు మితియుండదుగదా? ఎవనిని తానత్యంతప్రేమాస్పదునిగ నెంచుకొనుచుండెనో, యెవనిదుఃఖమే తనకు దుఃఖమనియు, నెవనిసుఖమే తన కామోదదాయకమనియు తలంచి తానుపాల్గొనుచు, పాల్గొనఁబోవుచునుండెనో, అట్టికమలాకరుఁడు తనకు లేడని తెలిసినచో నాముద్దులాడి, యేమికావలయును? ఆమెదుఃఖమును సహించుటకంటె యామె కాష్ఠజాలములను గాంచుకంటె_ ఆమెకంటెముందుగ మరణించుటయే మేలుకాదా? ఇప్పుడే పోయినచో నామెకు నేనుమరణించితినన్న విచారముకంటె వేరొండుగలుగదుకదా? నిజముగ నేను శిక్షాపాత్రుఁడనైనచో నీవే నాహస్తముల యందు పిస్తోలు నిడి యాత్మహత్యను ప్రోత్సహింపకుందువా?” యని వాపోవదొడగెను.

ఆపదలపాలయినపుడే మహాజనులు ధైర్యమును చిక్కఁబట్టుదురని భర్తృహరి వచియించి యుండెనుకదా. రవీంద్రుఁడు సహజధైర్యమును విడనాడక “కమలాకరా! ఏటి కిట్లనవసరముగ వాపోయెదవు? ఇదివరలో నాకొసఁగిన వాగ్దానమును మరచితివా? నీకిప్పుడేదియు చెడుగు తటస్థింపలేదుకదా? అదియుగాక, ధనపురేశుఁడీపాటికి మృత్యుముఖమున బడిపోవకూడదా?,, యనియూరార్చెను.

“నిజమే. మొదట నాకు నట్లేతోచెను. నేను లేచినంతనే నాకదియే తలంపు. కాని అట్లుజరుగకుండుగా తమని ప్రార్థించుచున్నాను. ఇదివరలో హంతకుఁడను గాకున్న నిప్పుడైననగుదును,,

"నిజమే. నాకీసంగతి తెలియనిదే మనమేదియు చేయుటకు వీలు లేదు. ఇప్పుడే పోయి నాసంగతి కనిపెదను. సెలవిమ్ము"

రవీంద్రుడు వానిని విడిపోయి రమేశునిగృహముచేరెను. రమేశుడు రోగులెందఱు కోరినను పోక, వానికై వేచియుండెను. రవీంద్రుడు రాగనే "రమ్ము. నీకొఱకెదురుచూచుచుంటిని. కాని, యెందరు వేడినను పోలేదు. రాత్రి జమీందారుని గృహమందేమిజరిగెనో వింటివా?,,

"ఏమిటది? మీకు తెలిసెనా?"

"అవును నేను పరుండబోవుచుంటిని. ఇంతలో నౌకరొకడువచ్చి తలుపుతట్టెను. నేను తలుపు తెరచుటయు, వాడు తనయజమానుడు చావుబ్రదుకులలో నున్నాడనియు, తక్షణము రావలసినదిగ మనోరమ తెలియజేయుమనెననియు, చెప్పెను. నేనత్యంతాశ్చర్యపరవశుడనై వెంటనే దుస్తులను ధరించిపోయితిని. నేను పోవునప్పటికి తారానాథుడు జీవచ్ఛవమై సోఫాపైబడియుండెను. అతని దేహము కొయ్యబారియుండెను, ముగముపైనొక చిన్న గాయమునుండి రక్తము స్రవించుచుండెను. వానినిజూచినంతనే సర్వమును ముగిసెనని తలంచితిని."

"మనోరమయో?,,

"మనోరమ భర్తదగ్గరకూర్చుండి, దాసిసాహాయ్యముతో వానికి మరల స్పృహతెచ్చుటకు ప్రయత్నించుచుండెను. ఇంతలో నేను పోయి, వానికుపచారములు సల్పి, మందునిచ్చితిని. కొంతకాలమునకాతడు శ్వాసమువిడువసాగెను. ఒకగంటలో మరల నెమ్మదిగ మాట్లాడసాగెను. అపుడు జరిగినసంగతినిగూర్చి ప్రశ్నించితిని. అపుడు మనోరమ చూపిననిశ్చలభావము వర్ణించి తీరవలెను. ఏమియు మాట్లాడకుండగనే నిజము చెప్పవలదనుటకోయన దీనముగ వానివైపుచూచుచుం

డెను. అంత తారానాథుఁడు నిజస్థితిని దాచి, వేరుమార్గముగ నీరీతిని చెప్పసాగెను. నేనీదినమున పూర్వముకన్న దేహస్థితి బాగుగానున్నట్లు తోచుటచే పడకమీదనుండి లేచి యెవ్వరిసాహాయ్యమును లేకనే, మెట్లనుదిగితిని. ఇంతలో బలహీనుఁడనై నడువఁజాలక పడిపోతిని. అచటనొక మేజాబల్లమీద పడుటయు, కొంచెముగాయముపడెను. ఆనొప్పిచేతను, నీరసముచేతను స్పృహతప్పిపోయెను" అంత నేను నవ్వినవానివలెనటించి "మీరు చాల పొరపాటు గావించినారు. ఇకనెప్పుడునిట్లు చేయరాదంటిని. అంతనాతఁడు సాభిప్రాయముగ భార్యనుచూచుచు "నిజముగనది పొరపాటే. ఇకనెప్పుడు నంతటిపొరపాటుచేయను. పూర్వముకన్న నెక్కువగా నిప్పుడు బ్రతుకవలెనను నాసపుట్టుచున్నది." అనెను.

రవీంద్రుఁ డేదియోమాటలుచెప్పుచుండినను, దానిని మాటలాడనీయక. "వినుము ఇంకను చెప్పవలసియున్నది." అని యలవాటుచొప్పున కండ్లజోడును తుడిచికొనుచు, "నేనింటికి పోవుచుండగ దారిలో పరిచారిక యొకర్తు భయాక్రాంతయై పరుగెత్తివచ్చి, వారిపెద్దకుమార్తె పద్మ మూర్ఛిల్లినదని చెప్పెను. నేను పోయి చూడగ నామె మూర్ఛావస్థలోనుండెను. నేనామెను సేదదేర్చిన తరువాత దీనికేమి కారణమని యడిగితిని. అంత పద్మ తల్లి వైపునకు చూచెను. కాని నేను వారిరువురకును మధ్యనుండుటచే నామెతల్లి చూపులను సైపఁజాలక యెట్టకేలకు "నేను రాత్రిపరుండియుండగ నెవ్వరో ద్వారముదగ్గర గంటను కొట్టిరి. అంత నేను కిటికీయొద్దకుపోయి నిలిచితిని. దాసి దీపముఁజూపగా నెవ్వరో లోనప్రవేశించెను." అని చెప్పునంతలో "వాఁడు కోర్టువారు వాకిలికి పంపినలేఖను గొనివచ్చినా" డని మనోరమ చెప్పెను. అంత నేను విశ్వసించినట్లు నటించి, తరువాత నేమి జరిగినదని ప్రశ్నింపగా "వాని తరువాత నింటిముందు చెట్లక్రిందనుండి రాత్రి

బొమ్మ యొకటి కదలివచ్చి దగ్గరనున్న చెట్టుక్రింద దాగుకొనెను. కొంతకాలమునకప్పటికి, యింటిలోనుండి పెద్ద కేకలు వినబడెను. ఇంతలో నాబొమ్మ పారిపోవుటయు, తరువాత నింటిలోనుండి యింకొక దయ్యము పారిపోయెను. ఆదయ్యములను చూచినప్పటినుండియు నాకు భయము వేయుచున్నది." అని చెప్పనంతలో మనోరమ, "రమేశా! ఇది వట్టి వెఱ్ఱిపిల్ల. దొడ్డిలోని విగ్రహములు కదలుననియు, నీయింటిలోని దయ్యములు పరుగెత్తుచుండుననియు భయపడుచుండును. పూర్వకాలమానందభవనములో నున్నపుడెవ్వరిసాహాయ్యమును లేకయే, దీపమైన లేక యింటియందు సంచరించుచుండెడిది. మీరు బాగుగ చెప్పి దీనిభయమును తొలగింపవలెను." నేను నంగులకు సమ్మతించి, యామెకు తగినరీతిని బోధించి, యీవలకువచ్చి చేతిలో సరూపాయ నొక దానిని క్రిందపడవైచి, వెదకికొనువానివలె నటించితిని. దీపము వెలుగులో, మనుష్యుల యడుగులు పెద్దపెద్దవి, మేకులు వేసిన చెప్పులు తొడుగుకొనినట్లు కనబడెను. నిజముగ దయ్యములే యుండుచో, గొప్పదయ్యములై యుండవలెను.

"అట్లయిన నీవు ననుమానించితివా ?"

"అగును. నిజముగ నేదోవ్యక్తి యీసంగతినంతను గమనించుచుండవలెను."

---

౩ వ ప్రకరణము.

[illegible]

లోకాభిరామాయణము.

ఏమిసంగతి ? ఎవరుగమనించుచుండిరి ? నిజము తెలియక నేను రాత్రియంతయు పరితపించుచుంటిని. ఏమిజరిగినదో చెప్పుము" రమేశుడు రహీమునడిగెను. అంత రహీముడు పూసగ్రుచ్చినట్లుగ నంతయు చెప్పివైచెను.

"అహా! నేనటువంటి దేదియో జరిగెననియే తలంచితిని. ఎన్నిమారులాలోచించినను నాకీసంగతియే తోచుచుండెను. కమలాకరుని వంటి దుస్థితిలోనుండినవాడెవ్వడిట్లుచేయకుండును. కాని వాని గ్రహములు బాగులేవు. వానికి సృష్టియే వ్యతిరేకముగ నున్నట్లు తోచుచున్నది."

"ఏమో. ఎవడెఱుగును! మనకిపుడు వచ్చిననష్టమేమున్నది? ఒకవేళ దైవము రక్షించి మనకు కమలాకరుని స్నేహితుడును, సీతయు కన్పించకూడదా? నేరము ఋజువు కాకూడదా?" ఏమి? నేను చేయుప్రయత్నము లంతనిష్ఫలములని తలంచితివా?

"అట్లెన్నటికిని నేను తలంపను. నీవు చేయుప్రయత్నము లెన్నటికిని వృథాకాజాలవు. అంతవరకును నాకు పరిపూర్ణమగు నమ్మకమున్నది."

"కావచ్చును."

"ఇక శివసింగుకూడ మాట్లాడవచ్చునని నాకేదియో పిచ్చినమ్మకమున్నది. అది నీచేతగాని, నీవారిచేతగాని జరుగునని నాయాత్మ చెప్పుచున్నది. అహా! మనకొక నెలగడువుండినచో నెంతబాగుండియుండును. అట్లయిన కమలాకరుని నిర్దోషిత్వమును స్థాపించియుందుముగదా? కాని దైవఘటనను తప్పించుటెవరితరము? ఇకవారమైనను గడువులేదే. ఈదినము గురువారము; రేపు సోమవారమునుండియు విచారణప్రారంభమగునట. అపుడే మణీంద్రచంద్రభూషణుడు మొదలగువారు వచ్చుచున్నారని తెలియుచున్నది. ఈలోపుగ మనకార్యము సానుకూలమగుజాడలు కనబడవు. ఇక మనము చేయవలసినదేది?"

"అట్లయిన నేనును, గణేశుడును పూర్వము తలంచినట్లు కల్పితకథను చెప్పి వానిని తప్పించజూచెదము."

"ఒకవేళ తారానాథుఁడు తాను చెప్పినట్లు సత్యసాక్ష్యము నిచ్చినచో?

"అతఁడు పొరపాటు పడినాడని చెప్పుదము."

"అయినను కమలాకరుఁడు శిక్షాపాత్రుఁడగునేమో?"

"మాత్రము" అని మెల్లగ, "కాని అదియే ఆఖరుతీర్పు కాజాలదు. నేను చెప్పునది విని, యెవరికిని చెప్పకుందుము. మేజస్ట్రేటు నకేమాత్రము అనుమానము గల్గినను మన యాశలడుగంటును. అతఁడు తప్పునవరించుకొనును. అతని కాయవకాశమీయఁగూడదు. లేనిచో నేను చెప్పినది చేసితీరెదను. జయముగల్గితీరును."

"అతఁడుత్సాహపూరితుఁడయ్యెను. వానివాగ్ధోరణి నిజముగ జయముగాంచినవానివలె శోభజేయుచుండెను. అంతియేకాదు. మన కార్యమేదియు చెడదు. మన కొకటి రెండుమాసములు గడువు కోరుదము. ఈలోపుగ మనకు కావలసిన సాక్ష్యములు సంపాదించితీరెదను. అంతియగాక శివసింగుచే మాట్లాడించితీరెదను. ఇదివరలో మనోరమను బైటపెట్టినచో నామె తప్పులకై తారానాథుఁడు బాధపడునని శంకించితిని. ఇపుడు తారానాథుఁడే కయ్యమునకు కాలుద్రువ్వినచో నిఁక నాతనిపై జెండానెత్తితీరెదను. అపుడు లోకులుకూడ నిదివరలో స్త్రీగౌరవమును రక్షించుటకు మనము చేసినత్యాగమును, మనయౌదార్యమును ప్రశంసించితీరుదురు. వారు మనకు సానుభూతిని చూపుదురు."

డాక్టరు రమేశుఁడు వీనిమాటలను నమ్మినట్లు కనబడలేదు. కాని రవీంద్రుఁడు వానిని సరకుగొనయే.

"మనము రెండవమారు విచారణలో జయముగాంచితీరెదము. మొన్నరాత్రి జరిగినదంతయు నేదో వ్యక్తి చూచెనంటివిగదా? అతనికి మేకులువైచిన పెద్దజోడులుండెనంటివిగదా? వాడు రంగస్వామి కాక

మరెవ్వఁడై యుండును. నేనాతనిని పట్టుకొనెదను. రంగస్వామి తా రానాథుని మాటలన్నియు పూసగుచ్చినట్లు చెప్పివేయును. అతడెట్లు తన పగను దీర్చుకొందునని ప్రతిజ్ఞచేసెనో, యథావిధిగ,పొల్లుపోకుండ చెప్పి తీరును."

"దైవమట్లు జరుగునని ప్రసాదించునుగాక." అని రమేశుఁడు పల్కెను.

ఇంతలో పలువురు వచ్చి తమ యిండ్లకు రోగులను పరీక్షించుటకు రావలసినదని కోరిరి. రవీంద్రుఁడు సెలవుగైకొని వెడలిపోయెను. దారిలో నాతఁడు గణేశుని సందర్శించి మాట్లాడి యింటికివచ్చెను. రవీంద్రుఁడు తన గదిలోనికిపోయి యీరెండు లేఖలను విప్పిచదివెను. వీధిలో నానంద యెదురుపడి "వానికొఱకు రెండు లేఖలు వచ్చిన"వని చెప్పెను. అందొకటి వానిమిత్రు లెవరో వ్రాసియుండిరి. రెండవది, సీత నన్వేషించుటకై పంపినకరీమ్‌నుండి వచ్చెను.

సీతజాడలు తెలియవచ్చెననియు, నామెను పట్టుకొనుట కింక నొక వారము దినములు గడువు కావలసి యుండుననియు, తెలియజేసి యింకొక ముఖ్యమగు విషయమునుగూడ వ్రాసెను. కమలాకరుని పూర్వపుస్నేహితుఁడగు నూగేశ్వరరాయఁడు మృతినొందక జీవించియుండెననియు, వానితమ్ముఁడు కనబడి వానిని రమ్మని యొక లేఖ వ్రాసెననియు, నాతఁడిచటికి వచ్చుటకు పదునైదునిముసములు మాత్రము కావలెననియు, వ్రాయుచు, తనకిచ్చిన ధనము ఖర్చయి పోవుటచే, యింకికొంతపైకము పంపవలసినదనియు వ్రాసెను. రవీంద్రుని సంతసమునకు మేర లేదు.

అతనికిక జయముగాంచుట నిముసమాత్రమునియు, ప్రథమవిచారణసమయములో తన కథ నెట్లో చెప్పి ద్వితీయవిచారణకై ప్రధానన్యాయస్థానమువారి కభియోగము చేయుటకు సంకల్పించుకొని,

యావర్త్తమానము మాత్రము సగులకు చెప్పక తత్క్షణమే వేయిరూప్యములు కరీమునకు పంపించెను. అతఁడచటనుండి భవానిశంకరుని శకటము నెక్కి కమలాకరుని గృహమగు సీతానదనమునకు పోయెను. అచట వాతఁడు సుబ్బుసింగును కలసికొని యెల్లయునను రంగస్వామిని పట్టుకొనుమని వానికి చెప్పి సాపుట్టకై బయలుదేరెను. సుబ్బుసింగు పాటలీపుత్రమునకు వచ్చుచు దారిలో రహీంగ్రిని కలసికొనెను.

రహీంగ్రిను— కమలాకరుని కొక యుపకారము చేయవలసి యున్నది

సుబ్బుసింగ్— అది యెట్టిదైనను చేసెదను. ప్రాణమునైన నిచ్చెదను.

"రంగస్వామి యెచటనుండెనో యెఱుగుదువా?"

"ఎఱుగుదును. వానిని పట్టుకొనుటకై ప్రయత్నించెదను. మొన్నటి వరకును జయిలులోనుండి కన్నము త్రవ్వి పారిపోయెనని వింటిని. అతఁడు వారిబాసుగుండిన ఘాటుపురములో నుండవచ్చును"

"పోలీసువారిని పంపితిమి. వారాతనిని పట్టుకొనగలరా?"

"వారితరము కాదు. వానికి పలువురు బందుగులున్నారు."

"నీవో, నీవు ప్రయత్నించిన పట్టుకొని తేరెదవు. మేమాతనిని మరల కొట్టులో పెట్టించువారము కాము. కాని వానికొక లేఖ నిచ్చెదను. దానికి జవాబు తెచ్చిపెట్టిన చాలును. ఈమాత్రము సాహాయ్యము నియజమానునకు చేయజాలవా?"

"అంతియేనా? అట్లయినచో నేనింటికిపోయి మావారికి చెప్పి బయలుదేరెదను." అని వెడలిపోయెను.

ఈరీతిగ రవీంద్రుఁడు చేతనైనన్ని యత్నములు చేయుచుండెను. ఎట్లయిన నెదిరిబలమును ధ్వంసముచేసి, కమలాకరుని గెలిపించి తీర వలెనని వాని దృఢప్రతిజ్ఞ. కాని జయముస్థిరమని యాతనికి నమ్మకము లేకుండెను. అందుచేత సన్నిహితాప్తులగు అనేకరమేశులకయినను, ప్రయత్నములు పూర్తియైన గాని దెలుపుట కాతఁడు నిశ్చయించలేదు.

ఈభారమునంతయు వహించుట కాతఁడు సమర్థుఁడా? ఇది యొక గొప్పసందేహముల సమయము. అందొక మనుష్యుని యాత్మగౌరవమును, ప్రాణములును పణములుగ నున్నవి. ఇట్టి దాని నొక్కఁడు సాగింప సమర్థుఁడగునా? ఈయూహ లన్నియు వానికి తోఁచియుండెను. కాని, రణవిద్యావిశారదుఁడగు దండనాథుఁడు తనసైన్యములను సర్ప, పద్మ, వరాహాది, వివిధవ్యూహములను పన్ని యెట్లు నడిపించునో, యట్లే రవీంద్రుఁడును వివిధవ్యూహములు పన్నుచుండెను. అతఁడు కమలాకరుఁడు నిర్దోషియనియు, ధర్మమే జయము గాంచుననియు, దైవము సజ్జనులను రక్షించి తీరుననియు, గట్టిగ నమ్మియుండెను అందుచేత తానెంతటి ప్రతిబంధకములు గల్గినను, వాని నవలీలగ, ఛేదించి వైతునని నమ్మియుండెను. ఇంతులకాతఁడు సమర్థుఁడా?

అతనిని చుట్టియుండినవారెల్లరును విగతాశులై యుండిరి; ఒకప్పుడు లక్ష్మీప్రదమై, యానందదేవత కునికిపట్టయి, కలకలలాడుచుండు నానందగృహమిపుడు పాడుపడినకోటవలె కాంతివిహీనమై యుండెను. ఇదివరకు దార్ఢ్యవంతుఁడై యుండిన ముసలిభవాని శంకరుఁడిపుడు సత్త్వవిహీనుఁడై యుండెను రెండుమాసములలో నాతఁడు నిజముగ తొంబది యేండ్ల ప్రాయమువాఁడై పోయెను. అహా! శోకమెంతవానినైనను క్షీణింపజేసి వైచునుకదా? ఇపుడాతనికి నద

చుటకు కర్రయూత కావలసివచ్చెను. వాని చేతులు వణకుచుండెను. మొగము తెల్లబడెను. కన్నులు లోనికి పోయెను. ఇంక జగత్కిశోరుని సంగతి చెప్పనవసరములేదు. ఇదివరలో నిరువదిమంది నొక్కమారుగ జయింపగల్గునట్టివాఁడిపుడు నిద్రాహారములుమాని, సర్వకాలముల యందును విచారించుచుండుటచే, నీరసించి, లేచి నడయాడుట కూడ మానివైచెను.

ఇట్లాయింటియందెల్లరును విచారసాగరమున మునిగియుండిరి. వారందరిలోన కొంచెము ధైర్యము వహించినవారిలో నొక్క యానందయే యగ్రగణ్యురాలు. ఆమె ధైర్య సాహసములను చూచి యెట్లయిన నామెను రక్షింపవలెనని రవీంద్రుఁడు సర్వవిధముల బ్రయత్నించుచుండెను.

విచారణకాలము సమీపించుచుండెను రమేశుఁడు వచించిన రీతిగా మణీంద్రచంద్రుఁడు వచ్చి సత్రములో విడిసెను. జ్యూరర్లును వచ్చియుండిరి. మణీంద్రచంద్రుఁడు దయార్ద్రహృదయుఁడు. కాని, కఠినుగానుండును. ఇరుతెగలవారిని బాగుగవిని, న్యాయమును బరిశోధించుటయం దాతని కెక్కుడుప్రీతి. అతఁడు కమలాకరుని వర్తమానమును వినినప్పటినుండియు వానియందు సదభిప్రాయమునే గల్గియుండినను విచారణసేయుట యాతని విధియైయుండెను.

ఎటర్నీజనరలు పీతానాథరాయలును వచ్చెను. అతఁడు వీధిలోనికి రాక పగలంతయు గృహముననే గడపుచుండెను. ముఖర్జీయు వాని వెంటనంటి యుండెను. రవీంద్రునితో కరంచంద్ ''వారు గొప్ప పన్నాగము పన్నుచున్నారఁట. కేసు యీమాటు చాల ప్రబలముగా నుండవచ్చు"నని చెప్పెను.

పాటలీపుత్రమున "భారతవర్ష" మను దినపత్రిక యొకటి వెలువడుచుండును. అందు మత, సాంఘిక, రాజకీయ, వాణిజ్యాదివివ

యములు నిష్పాక్షిక బుద్ధితో చర్చింపఁబడుచుండును. అది యఖిల భారతీయ మహాజనసంఘము వారి యుపశాఖచేఁ బ్రచురింపఁబడుచుండుటచే దానికి ప్రచార మెక్కుడుగ నుండెను. మఱునాటి యుదయమున నానందమయి భారతవర్షమును చదువుచుండఁగ నందులో నిట్లు ప్రకటింపఁబడుట గాంచెను.

న్యాయస్థాన సంచార కార్యాలయమునా

కార్యక్రమము.

న్యాయమూర్తులు సురేంద్రచంద్రరాయగారు మొదలు

| | |
|---|---|
| సోమవారము:— | దోపిడి నేరములు.<br>చరాస్తి తగాయిదాలు. |
| మంగళవారము:— | తగవులాటలు.<br>ఇతర నేరములు. |
| బుధవారము:— | ఇండ్లు తగులబెట్టుట<br>హత్యానుద్యమించుట. |

(వరా.— కమలాకరుని నేరముమాత్రము.)

ఇంక రవీంద్రునకా యెన్ని ప్రయత్నములు సల్పినను ప్రథమ విచారణ వాయిదాచేయుటకు వీలు లేదు; కావున, తానిదివరలో సంకల్పించినరీతిగ నడుపుటకు ప్రయత్నములు సలుపుచుండెను. వారెన్ని విధముల ప్రయత్నించినను, ముఖర్జి వ్యవధియైనచో నేరస్థుని పక్షము వారు సాక్షులను త్రిప్పివేసిగాని, మరియేయితరములగు నుపాయముల చేతగాని నేరస్థాపనమునకు భంగము గల్గింతురనుభయముచే విచారణ వాయిదాసేయఁజనదని గట్టిగ వ్రాసెను. ఆకారణమున నింత సంభవించెను. ప్రథమవిచారణ జరగినంతనే హైకోర్టులో నప్పీలు చేయుటకు సంకల్పించి రవీంద్రుఁడు గణేశునితో భావికార్యక్రమమును గూర్చి తెల్పుటకయి పోయెను.

## 10 వ ప్రకరణము.



### విచారణ.

కమలాకరరాయలు నిదురనుండి లేచెను. అతని కారాత్రి నిదుర సరిగ లేదు; తన నేరము విచారింపఁబడినట్లును ఉరిశిక్షవిధించి నట్లును, బంధువులందరును తన్ను కౌగిలించుకొని యేడ్చినట్లును. వివిధములగు స్వప్నములుగనెను.

నేడు విచారణదినము విచారణజరిగెను. ఆదినమున 'భారత వర్షముదయమున నే కాక సాయంకాలముగూడ ప్రచురింపఁబడెను. కొందరుపిల్లలు దానిని వీధులవెంబడితిరిగి విక్రయింపుచుండిరి. అందిట్లు వ్రాయఁబడి యుండెను

"కమలాకరుని నేరము."

నేడు పాటలీపుత్రముచరిత్రలో నొకగొప్పదినము; ఎల్లరకు నుత్సాహపూరితమగు సమయము! ఏమిసంరంభము! ఏమిగడబిడ! ఈదినము పదిగంటలకు హత్యానేరము విచారింపఁబడెను.

ఉదయమునుండియు పలువురు కోర్టులోనికిపోయి చూచుటకు టిక్కట్లను కొనుచుండిరి. కాని సామాన్యులకందరకును టిక్కట్లు దొరకునా? పాటలీపుత్రములోని వారేగాక చుట్టుపట్ల గ్రామముల నుండియు, పెద్దమనుష్యు లనేకులు విచారణ యేరీతినంతమొందునో యని చూచుటకు వచ్చియుండిరి. విచారణజరుగుప్రదేశ మొకగొప్ప మేడ. అందయిదారువందలు జనముపట్టుటకు మాత్రము తగిన స్థలముండెను. గొప్పవారికిని, గొప్పవారి ప్రక్కనున్నవారికిని, మాత్రమే టిక్కట్లు దొరికెను. తక్కినవారు తీర్థప్రజలవలె నిసుకజల్లినను రాలకుండునట్లు వీధిలో నిలచియుండిరి. ఒకరి నొకరు త్రోసికొనుచుండిరి. చివరకు, చిలికి చిలికి గాలివానయైనట్లు త్రోపుడులు గుద్దులాట

వరకును దిగెను. మిగుల కష్టముమీద రక్షకభటాధికారి తన పరివారముతో నెట్లో సంరంభమణచెను. గొప్ప గొప్ప జమీందారులును, న్యాయవాదులు మొదలగువారు వచ్చి కూర్చుండియుండిరి. మధ్య నొకపీఠ మమర్పబడి యుండెను. అందు న్యాయాధీశుడును, జ్యూరర్లును, నేరస్థుని బంధుగులగు భవానిశంకరుడు, నవీనమోహనుడు, మొదలగుమిత్రులు, ధర్మపురేశుడును వచ్చి కూర్చుండిరి. తాతసమీపమున నే యానందయు వచ్చి కూర్చుండెను. ఆసమూహములో నామె యొక్కతెయే స్త్రీ, ప్రక్కనుస్త్రీలకొఱ కొకప్రత్యేకస్థల మేర్పాటు గావింపబడెను; అందు భవానియు, తదితరులగు నైశ్వర్యవంతులగు స్త్రీలును కూర్చుండియుండిరి;

న్యాయాధీశుని ముందొక బల్లపై నొకయెఱ్ఱనిగుడ్డకప్పి కొన్ని వస్తువులుంచబడి యుండెను;

గడియారము పదునొకండుగంటలు కొట్టెను; అంత వాప్రక్క గదిలోనుండి మనకు చిరపరిచితులగు నేరస్థునిన్యాయవాదులగు రవీంద్రుడును, గణేశుడును, వచ్చి కూర్చుండిరి; ప్రభుత్వము వారి న్యాయవాదియగు సీతానాథరాయలును వచ్చి తన యాసనముపై కూర్చుండి యుండెను;

ఇంతలో నేరస్థుడిరువంకల నిరువురు రక్షకభటులు పరివేష్టించిరా తనకు నియమింపబడిన యాసనము నధిష్ఠించెను. అతడు విలువగల వస్త్రములను దాల్చియుండెను. అతని వక్షస్థానమున గౌరవచిహ్నమగు బంగారుపతకమును జమీందారులకీయబడు నీలివర్ణపుపట్టుపట్టీయు ధరియించియుండెను అతనిమొగము వెల్లబారియుండినను కండ్లనుండి యొకవిధమగు తేజము వెలువడి, వాని హృదయగాంభీర్యమును, విశ్వాసమును చాటుచుండెను. ఇంతలో రవీంద్రుని ప్రక్కకు వచ్చి రమేశుడు కూర్చుండెను.

అందరును విశ్రబ్ధముగ నుండునట్లు కట్టడిచేసి, మణిసుందరి చంద్రభూషణుఁడు నిందితునిదిక్కయు, వాని పేరు, వయస్సు, హోదా, మున్నగునవి ప్రశ్నించుటయు నేరస్థుఁడు తగినరీతి ప్రత్యుత్తరమిచ్చెను. పిమ్మట న్యాయాధీశుఁడు వానిని కూర్చుండి నేరారోపణమంతయు వినునట్లాజ్ఞాపించెను. కరంచంద్ కేసంతయు వినిపించెను, అది మనకు చిరపరిచితమగువిషయము గనుక వేరుగ వ్రాయ నవసరము లేదు, అంతసువిధముగ ప్రశ్నోత్తరములు జరిగెను.

న్యాయాధీశుఁడు" నిందితుఁడా ! ఇదివరలో ననేక ప్రశ్నల కుత్తరువులీయ నిరాకరించితివి. ఇపుడు వానికన్నిటికి సదుత్తరము లీయనిచో నీకు కష్టము సంభవించును. నిమేలునుగోరి ప్రశ్నించుచున్నాను. నిజము చెప్పుము

కమలాకరుఁడు "మహాశయా! నిజము తెలియవలయుననియే కోరుచున్నాను. అన్నింటికిని తగుసమాధానముల నీయువాఁడను.

న్యా—ప్రథమమున నీవేలమౌనము ధరించితివి?

కమ—వారుకోర్టులోగాని చెప్పుట కిష్టము లేకుండెను.

న్యా—నీపై నారోపింపఁబడిన నేరములన్నియు వింటివిగదా?

కమ—నేను నిర్దోషిని. నా చెప్పఁబోవు సంగతి సావధానచిత్తులరై వినుదురుగాక. మధుపురము కేసు చాలదారుణమైనది కాని సరిగ నాలోచించిచూచినచో నది వట్టి తెలివితక్కువ పని. పిచ్చివాఁడు గాని యిట్లొనర్చియుండఁడు. ఇఁక నేనన్ననో, యిదివర కున్మాదుఁడనై యుండలేదని యందరు నెఱుఁగుదురు.

మణి—అది విచారణీయమే.

కమ——కాని—

మణి—ప్రస్తుతము నేనడిగిన ప్రశ్నలకుత్తరము నీయవలెను. తదనంతరము నీవు చెప్పఁబోవుట కవకాశమీయఁబడును.

కను—నేనింతకు మించి చెప్పజాలను. అట్లు చెప్పవలసి వచ్చి నచో రాధాకాంతునిపై నేరారోపణ చేయవలసియుండును.

(సభలో గుసగుసలు) మన్ను:—సభికులారా ! మీరధికారి గౌరవము మన్నించి నిశ్శబ్దముగ నుండవలెను. లేనిచో మిమ్ములనంద రను పైకి పంపించివేయవలసి యుండును.

సీతానాధరాయలు:—ఒకప్రభుత్వోద్యోగిపై నిందారోపణ చేయుచు నను వాక్యములను సహింపజాలను. మేజస్ట్రేటిందు కను నేర్పుతో పనిచేసెను. నిందితునకట్టి దురభిప్రాయమున్నచో మొదటనే తెలియజేసి యుండవలసినది. అతఁడు నిర్దోషి కాజాలఁడు. న్యాయవాది పరీక్షనిచ్చిన యీతనికి చట్టములన్నియు తెలిసియుండును. అతని న్యాయవాదులు సమర్థవకాలులే.

గణేశుఁడు:—మేమూ మేజస్ట్రేటు నిష్పాక్షికబుద్ధితో ప్రవర్తింప లేదనియు, వీరినుండి కేసు మరియొక న్యాయస్థానమునకు మార్పు చేయవలెననియు కోరియుంటిమి. కాని యతఁడు నిర్దోషియని తలంచి యుండుటచే మేము చెప్పినట్లు చేయఁడయ్యెను.

సీతానాధుఁడు:— జ్యూరర్లే దీనినిజానిజములను కనిపెట్టుదు రుగాక.

మణి—(నేరస్థునితో) ఇప్పుడైన నీరహస్యమును వెల్లడించు దవా ?

కమ—అట్లేచేయుదును. నావివాహము విషయమై మాకులగు రువుతో సంప్రతించవలసి యుండెను. అదియుగాక నింకను కొన్ని విష యము లాయనతో మాట్లాడవలసి యుండెను. మామతగురువుతో నావిషయమై చెప్పియుంటిని; అతఁడావిషయమును మీ కెఱుక పఱచ గలఁడు.

సభికులందరు నేదోయొకయపూర్వసమాచారము వినబోవు దుమని తలంపుచుండగా వారికాశ్చర్యంగము గల్గించెను. వారందరు

నా కారణమున నప్పుడొకడిగిరి. మరి గుర్రము వానిని మారించి (నేనున్నని
త) చెప్పుము!—

కమ—ఆ కారణమున వారిని దర్శింపబోయితిని. కాని యూరి డింట లేడయ్యెను ఎన్నిమారులు పిలిచిన నెవ్వరును పలుకరైరి. ఇంతలో నొక బాలిక యూరివి నూరివెలుపల చూచితినని చెప్పెను. నేనా తనను కలిసికొనుటకై పోయితిని. కాని యచట నాకాతడు కానరాలేదు నేనేమి తప్పు చెప్పెనని తలంచి యింటికేగితిని.

మణి—ఇదియేనా నీవు చెప్పదలంచినది?

కమ—ఇదియే.

మణి—ఇది విశ్వాసార్హమని తలంచితివా?

కమ—ఇదివరలో నేను నిజము చెప్పదనంటినిగాని, నమ్మదగినది చెప్పి, కానిచో మానుడు నని వటియించియుండలేదు. అదియుగాక యింత చిన్నవిషయము చెప్పినచో నమ్మరనియే నేనిదివరలో చెప్పుకుంటిని. కాని యిందసంభవమొద్దియు లేదుకదా?

మణి—అట్లయినచో నీవేల యద్దుతోవిలుచుట్టితివి? సరియగు రాజమార్గమున నే పోజాలకుంటివా?

కమ—అది దగ్గర త్రోవకదా?

మణి—లక్ష్మణుసిడా చి వెంటనులకు భయపడితివి?

కమ—నేను భయపడలేదు. కాని చకితుండనైతిని. ఎవరు నుండరని తలంచినపుడు వానిని జూచినంతనే నాకు సంభ్రమము గలెను.

మణి—అట్లయిన నీవెవ్వరు నుండజాలరని తలంచితివా?

కమ—అట్లనుకొనలేకుగాని, యిట్లనుకొనుట తప్పా?

మణి—నీవచటనుండినందులకు కారణము వానితో చెప్పుట కేల ప్రయత్నించితివి?

కమ—నేనేదియు చెప్పలేదు. లక్ష్మణుఁడు తానెచటికిఁబోవు చుండెనో నాతో చెప్పెను. నేనును రంగాపురమున కేగుచుంటినని చెప్పితిని.

మణి—నీవడవిలోనుండి పోవఁగలవాఁడననియు, పిట్టలనుగూడ వేటాఁడనుంటిననియు చెప్పి తుపాకిచూపలేదా?

కమ—అయియుండవచ్చును. అది నిందార్హమా? అల్లిన్నమను కానేరదు. నేను నిజముగ ద్రోహబుద్ధికలవాఁడనైనచో వానిని జూచి నంతనే నాకపాయముగల్గునని శంకించి, వెనుకకు తిరిగిపోయెడివాఁ డనే. అట్టితలంపు లేకుండుటచే నిర్భయముగ వెడలిపోయితిని.

మణి—మతగురువును కలసికొనుటకు పోవుచు తుపాకినేల గొనిపోయితివి?

కమ—నాభూమిలో మృగములు పెక్కులుండును. అందుచేత నాకు తుపాకి గొనిపోవుట యలవాటు. ఆసంగతి యీగ్రామస్థుల కందరకును తెలియును.

మణి—తిరిగిపోవుచు నీవేల యడవిలోనుండి పోయితివి.?

కమ—అదియే చాల దగ్గరదారి యని తలంచెదను. కాని, ప్రయాణము చేయువాని నీదారి నేల పోయితివనినచో నేమి చెప్పును? అది వానియిష్టము.

మణి—నిన్ను వృద్ధుఁడగు కట్టెలమ్మువాఁడు చూడలేదా?

కమ—వాఁడు చూచెనని మాజిస్ట్రేటు నాతో చెప్పెను.

మణి—వాఁడు, నీవు సంభ్రమావస్థలోనున్నట్లును, చెట్లయాకులను ద్రుంచుచున్నట్లును చెప్పెనే?

కమ—నిజమే. నాకు విషాదము గల్గెను. ఒకవంక నాప్రియురాలితో సంభాషింపఁజాలనైతిని. ఇంకొకవంక తలంచినకార్యమును

పాడయిపోవును. ఉభయభ్రష్టత్వము గల్గుటచే వాకు కోపము వచ్చెను. అందుచేత వావిధిని దూషించియుండవచ్చును.

సభికులు చిఱునవ్వు నవ్విరి. మహేంద్రుఁడు మరల వారిని వారించి, "కమలాకరా! నీపురోహితుఁడు బందుగులయింటికి భోజనమునకై పోయెనని యెఱుఁగుదువా?

గణేశుఁడు—మేము కమలాకరుని కానంగతి తరువాత చెప్పితిమి. అతఁడు జరిగినదంతయు మా కెఱింగించుటచే మే మా పురోహితు నడుగుటయు, మా కాతఁ డట్లు చెప్పెను. ఆచిన్నపిల్ల చూచినది వేరొకఁడు; అతఁడు కావలసినచో నట్లు సాక్ష్య మీయఁ గలఁడు.

మహేంద్రుఁ డాతనిని కూర్చుండఁజేసి,

"వనమాలి నిన్నుఁ జూచినపుడు నీ వామెతో మాట్లాడక యే సాహాయ్యము చేసిపోయితి వనియు, నట్లయిన తప్పించుకొనఁ జూచె ననియుఁ జెప్పెనే?"

కమ—ఆరాత్రి చాల చీఁకటిగ నుండెను; ఆమె నాముఖము ను చూచియుండఁ జాలదు. ఆమె నన్నొకింత సాయము చేయుమని కోరెను. నేనట్లు చేసితిని. ఆమెతో సంభాషించుటకు నా కేదియు నగత్యము కనఁబడలేదు. అందుచేత నామెతో మాట్లాడలేదు. ఆమె యొద్దు నింపాదిగ నడచుచుండుటచేతను నేను ముందుపోయితిని; గాని, నా కామెనుండి తప్పించుకొను నవసరము లేదు.

అంత న్యాయాధీశుని యాజ్ఞానుసారముగ కానిస్టేబుల్లు మీఁదనున్న పొట్లగుడ్డను తొలగించివైచిరి. అందు నేరము జరిగిన నాఁటిరాత్రి కమలాకరుఁడు ధరించిన యుడుపులును, వాని తుపాకియు, నొకచిన్నగిన్నెలో మసియు, దానిపై సీరును, రెండుమూఁడు తూటాలు నుండెను. అందఱును దానిలో నేమున్నదో చూచుటకు

లేచి నిలువఁబడిరి. న్యాయాధిపతి వారిని మరలఁ గూర్చుండఁ జేసెను. వానిని నేరస్థునకుఁ జూపి,

"ఇవి నీ వానాఁడు ధరియించిన దుస్తులేనా?"

కమ—అగును.

మణీ—ఇవి మతగురువును దర్శించుటకుఁ దగిన దుస్తులే యని తలంచితివా?

కమ—అతఁడు నాస్నేహితుఁ డగుటచే నేనంతమాత్రము స్వాతంత్ర్యము వహించుట సహజము.

మణీ—ఈగిన్నెలోనున్నది చూచితివా? ఇందు నీరంతయు పైనున్నది. లోన మసియున్నది.

కమ—అది సత్యమే. మేజస్ట్రేటు మాగృహమును పరీక్షించిన దినమున నిగిన్నెలో నంటించిన కాగితములమసి యున్నది. నన్ను దీనివిషయమై ప్రశ్నింపఁగా నిస్సందేహముగ నాతనితో నేను చేతులను కడుగుకొంటినని చెప్పితిని. నేను నిజముగ ద్రోహినైనచో తగిన జాగ్రతను తీసికొని నాకు ప్రతికూలముగ నుండునని తోఁచినవస్తువు లన్నియు దాఁచిపెట్టియుండనా? అట్టిస్థితిలో నీచిన్నవిషయమే ఘనమగుసాక్ష్యమని తలంచుట యేటిన్యాయము?

మణీ—అది నిజముగ ప్రబలమగుసాక్ష్యమే

కమ—అది చాల సులభముగ త్రోసివేయఁ దగ్గును. నేను చుట్టకాల్చుట కలవాటుపడి యుంటిని. నేను పోవునపుడు నాతో చుట్టలను గొనిపోయితిని. కాని నిప్పుపెట్టె మఱచితిని. అందుచే నలవాటుప్రకారము నగ్ని ప్రజ్వలింపఁ జేసి చుట్టలు త్రాగితిని. అందుచేత నాచేతులు మసివారెను. నేనింటికి తిరిగివచ్చి నాచేతులను శుభ్రపఱచికొంటిని.

గనేశుఁడు—ఇది యసత్యము కాదు. ఈతఁ డానందగృహమందు మఱచిన నిప్పుపెట్టె యిప్పటికి నచటనే యున్నది.

మణిం—గణేశా! అదిగో కమలాకరుని చెప్పనిమ్ము.

కమ—అందుచేత నాపేరు మలినమైనది.

మణీ—(తుపాకిని చూపి) ఇది నీదేనా?

కమ—అవును నాదే. ఒకమారు చూతువా?

మణి—చూడవచ్చును

అతఁడాత్రముతో దానిని స్పృశించెను. ఒకగొట్టములో చేయిపెట్టి చూచెను. తన న్యాయవాదులవంకఁ జూచి యేదో మెల్లఁగ చెప్పెను. వాని మొగము జేవురించెను.

మణి—ఏమది?

గణే—(లేచి) కమలాకరుఁడు నిర్దోషియని ఋజువు చేయుటకు బలమగు విషయము కనఁబడినది. దైవానుకూలముగ తని సేవకుఁడగు రాఘవుఁడు నేరము జరిగిన నాఁటి పూర్వదినము తుపాకిని శుభ్రపఱచియుండెను. ఇపుడుకూడ నీరెండుగొట్టములలో నొకటి శుభ్రముగనే యున్నది. అందుచేత కమలాకరుఁడు తారానాథునిపై రెండుమార్లు ప్రేల్చియుండుట యసంభవమని తెలియుచున్నది.

ఇంతలో నిందితుఁడు తుపాకిని గైకొని తన జేబురుమాలు నంగులోనికి చొప్పించి తుడిచి పైకిఁ దీసి శుభ్రముగ నున్నదనుటకు నిదర్శనముగ చూపించెను. ప్రేక్షకులెల్లరు దాని నత్యంతోత్సాహముతో చూచుచుండిరి.

మణీంద్రుఁడు—అట్లె రెండవదానినిగూడ చేసిచూపుము!

నిందితుఁడట్లొనర్చెను. అదియు శుభ్రముగనే యుండెను.

మణి—చూచితివా? ఆరెండును శుభ్రముగనే యున్నవి. నీవిదివరలో సుమారు రెండుడజను తూటాల నుపయోగించితి నని చెప్పితివి. దీని నిజము తెలిసికొనుటకు తుపాకులయం దాతికేతః వారిని పిలిపించియున్నాము. ఓయీ! భటుఁడా! వీధిలోనున్న భీమసింగు

ను విలువ్రము! భీమసింగు ప్రవేశించెను. అతని నందఱును యెఱిఁగి యుండిరి. అతఁడు తుపాకులను చేయుటయందును, కాల్చుటయందును ప్రవీణుఁడని మన మెఱుఁగుదుము. అతఁడు తుపాకిని చూచి పరీక్షించి "ఇది చాల విలువగలది. ధనాఢ్యులకుఁ గాక, యితరుల కిట్టివి యుండఁజాలవు." అని చెప్పసాగెను. మణీంద్రుఁ డాతని నివారించి "అనవసరప్రసంగ మేల? దీనినిగుఱించి మీకు తెలిసిన విషయము లేమో చెప్పు" మనియెను.

భీముఁడు—చిత్తము. దీనిగొట్టములు సాధారణముగ మలినము కావు.

సందితుఁడు—అది తప్పు. నేను నాతుపాకిని చాలసార్లు శుభ్రపరచియుంటిని. ఇది చాలగుండ్లు పేల్చినచో మలినమగును.

భీముఁడు—కాని, యది సాధారణముగ పెక్కుగుండ్లు పేల్చియుండుటచే నట్లు కావచ్చును. ఒకటిరెండుగుండ్లను ప్రయోగించినచో నేను చెప్పినట్లే యుండును.

కమ—అది నేను సరికాదని వాదించెదను.

మణీ—ఏదాఱు కాల్చినచో?

భీము—తప్పక మసియగును.

మణే—నాళములను రెండింటిని పరీక్షించి నియభిప్రాయ మేమో చెప్పుము.

భీముఁడు—(అట్లుచేసి) తుపాకి తుడిచినతరువాత రెండుగుండ్లయినను పేల్చినట్లు తోఁచదు.

మణీ—(నేరస్థుఁతో) చూచితివా! నీవు పేల్చితి నన్న డజను గుండ్లగతియు నేమైనదో! ఇఁక నీచేతు లేలమురికియగును?

గణే—ఇది చాలముఖ్యమైన విషయము. ఒకసాక్షిమాటలతో సంతృప్తిపొందుటకు వీలు లేదు.

సీతానాథుఁడు — మనకు నిజము కావలెను. కావలయునన్న నొకమారు పేల్చి చూడవచ్చును.

భీముఁడు — అట్లే చేసెదను (అని వీధిలోని కొకమారు తుపాకి కాల్చెను. ప్రేక్షకులు భయకంపితులైరి, స్త్రీలు భయముచే నలి దిరి. (మరలివచ్చి) నేను చెప్పినది సత్యమే. ఈవాళములు రెండును శుభ్రముగనున్నవి.

మన్ని — (నిందితునివైపు తిరిగి) నీవింతకును నీకనుకూలమగునని తలంచినవిషయము నీకు ప్రతికూలమైనది; సరియే. ఇఁక నాప్రశ్నల కుత్తరువిమ్ము! నీకును తారానాథునకును గల సంబంధమేమి?

నిందితుఁడు — మాకేదియు సంబంధము లేదు.

మన్ని — ఊరందఱును మీరిరువురును వైరులని తెలిసికొని యుండలేదా?

నిం ది — అది తప్పుటభిప్రాయము. నే నాతనిని ద్వేషించుట లేదని దైవసాక్షిగ చెప్పఁగలను. అంతియకాక, నా కాతఁడనిన చో చాలభక్తిగలదు.

మన్ని — కాని మీయిరువురును భూములవిషయమై తగాదాలు పడుట లేదా?

కమ — అది నిజమే, మా పెదతండ్రిగారు వారితో తగవులాడు చుండిరి. ఆయనగతించినతరువాత నేనా వ్యాజ్యమునే జరుపుచున్నాను! నేను రాజీకి ప్రయత్నించినను జరుగలేదు.

మణి — రాజీ కియ్యకొననప్పుడు తారానాథునిపై కోపించి నీ వాతనిని తుపాకితో కాల్చెదనని బెదరించలేదా?

కమ — లేదు.

మన్ని — చూచినట్లు సాక్షులున్నారు. ఇంకొకమారు నీ వాతని పై విసుగు జనింపగా, నాతనికెపుడో తగినశాస్తి యొనర్చినగాని మాననని పలుకలేదా?

కమ—ఒకవేళ యతఁడు పడఁగనము ఇంతలో చంపివేయునా?

ఇంతలో నొక భటుఁడరుగుదెంచి "దేవా! తారానాధరాయఁడుగారు సాక్ష్యమీయదలంచినారు మీయనుజ్ఞకయి వేచియున్నా"రని చెప్పెను. అందుకు నాశ్చర్యపడి "సరియే. లోనికి తీసికొని ర" మ్మని యాజ్ఞాపించి సెలవిచ్చెను. రమేశుఁ డేదియో చెప్పబోవుచుండెను. రక్షకభటులతనిని వారించెను తారానాధుఁడిరువంకలను మోచి కొనిరాగా నొకకుర్చీలో కూర్చుండెను. వానిని చూచినంతనే ప్రేక్షకులందరును విచారించిరి. అతఁడు చాలబలహీనుఁడై యుండెను. మొగము కళావిహీనమైయుండెను. అతఁడు నియమప్రకారము ప్రమాణికము గైకొనెను. కాని, అతనిని మామూలుగ నిజము చెప్పెదనని పల్కుమనుటయు, నాతఁడా మాట నత్యంతస్పష్టముగ చెప్పెను అబద్ధము చెప్పనని పల్కెను.

మన్న—(దయార్ద్రభావముతో) అయ్యా! మీరు శ్రమయిచ్చి సంగతులను తెలుపుడు.

తారా—న్యాయాధీశా! నాకర్తవ్యమును నెరవేర్చుచున్నాను. ఇంతగా ప్రశంసింపవలసి లేదు

మన్న—మీరు చెప్పునదేమో కానిండు.

తారా—నేను పరుండఁబోవునప్పటికి సుమారు పదునొకండు గంటలు కావచ్చును. నేను స్వప్నావస్థయందుంటిని. ఇంతలోనె నాగది నిండ వెలుతురు వ్యాపించెను. ఏదో యంటుకొనెనని గ్రహించితిని. తత్క్షణమే మంచముదిగి తలుపు తెరచికొని మేడమెట్లుదిగి గుమ్మము దాటివచ్చితిని. ఇంతలో నాప్రక్కలో బల్లెముపోలుపలె నొకగుండు వచ్చి తగిలెను. తుపాకి చప్పుడయ్యెను. ఆవంకకు పరుగెత్తితిని. ఇంతలో నాకుడిభుజములోనొక గుండు తగిలెను. స్మృతి తప్పి పడిపోతిని.

మన్న—ఆ రెండింటికి నెంత కాలము పట్టియుండును?

తారా—ఐదారుమాసములు.

మణి—మీరంతలో గ్రహింపఁ గుర్తింపజాలిరా?

తారా—అతఁడొక కర్రలగుట్టచాటునకు పరుగెత్తెను.

మణి—అతఁడే దుస్తులను ధరించెనో చెప్పగలరా?

తారా—ఆహా! (యని మనకు తెలిసియున్న కమలాకరుని దుస్తులను వర్ణించెను.)

మణి—(పైకప్పును తొలగించి) ఇవేనా?

తారా—తప్పకుండ నవియే.

మణి—అట్లయిన మీరు వాని గుర్తించియుండవచ్చును.

తారా—మంటలవెలుగులో కమలాకరుఁడు కనిపించెను.

శ్రోతలందరును విచారగ్రస్తులైరి. కాని, నిందితుఁడించుకయైన చలింపలేదు. వాని న్యాయవాదులు నవ్వుచుండిరి. వారు తమకక్షిదారుని కరిత్యజించిరో లేదు; అతనితో మెల్లగ మాటలాడుచుండిరి. కాని సీతానాథుఁడును, మణీంద్రచంద్రుఁడును, ఆశ్చర్యపరవశులైరి. మణీంద్రుఁడు "తారానాథా! నేనింతకుముందే మీకేమైన తగవులున్నవా యని యడిగితిని.

తారా—మాకొక చెఱువువిషయమై తగవుగలదు.

మణి—నిన్నాతఁడొకసారి చంపనుద్దేశింపలేదా?

తారా—కాని యాతఁడు క్రోధపరవశుఁడై యట్లని యొకసారి తలచితిని.

మణి—అట్లయిన నిన్నాతఁడే చంపనుద్దేశించెనందువా?

తారా—"అగును. దైవసాక్షిగ నే నాతనినిచూచితిని" ఇట్లనునంతలో నాతని దేహము వణకసాగెను. భటులిరువు రాతని ప్రక్కనున్న గదిలోనికి తీసికొనిపోయిరి. మనోరమకు కబురంపనులేమో యని తలంచితిమిగాని, తన చిన్నకూతురునకు జబ్బుగనుంటచే నా

తానావాఁడును నిష్కారణముగ తుపాకి వ్రేటులకు గురియయ్యెను. అతని బిడ్డలును భార్యయును మంటలలోఁబడి మృతినొందవలసినవారే. కాని, దైవకృపచే నొకమూర్ఖునివలన రక్షింపఁబడిరి. ధనమంతయు నాశనమయ్యెను. ఇండ్లు, వాకిండ్లు, గోశాలలు, ధాన్యపురాసులు, సర్వమును నగ్నిజ్వాలలంబడిపోయెను. ఇంతేగాక దీనికి ఫలితముగ, బీదవాఁడును, రెక్కలకష్టముచే కుటుంబపోషణముచేసికొనువాఁడునగు నాతఁడును, వానిలో నింక కొంతమందియు మరణించిరి. దీనికంతకును కారణమెవ్వరు? ఈదుష్కార్యమును నెలవెట్టినద్రోహి. అతఁడేమిచేసెను? ఘోరముగు పాపముచేసెను. అందులకు సాక్షులుండిరా? అనేకులున్నారు. అందుముఖ్యముగ దెబ్బలుతినిన యాతఁడే సాక్ష్యమిచ్చుమంతలేదా? దోషి వాదించెను. కాని, నేరము రుజువయ్యెను. వానితరఫున సాక్షులిరువురు పురోహితులు తప్ప వేరులేరు. వారైనను సరిగ జెప్పజాలరైరి. ఇఁక వారివాదనయంతయు భగ్నమయ్యెను. వారు చెప్పినదానికి ప్రతికూలముగ నిదర్శనములు కనఁబడెను. ఇఁకజరిగిన హత్యయో, ఘోరము. మరియు, నిదింతుఁడెట్టివాఁడు? ధనవంతుఁడు. యౌవనుఁడు. అనుపును, ఆజ్ఞయు, లేక యిచ్చవచ్చినట్లు సంచరించును. ఊరివారిచేత మెప్పువడయుటకు డంబములు కొట్టుచు, లోలోన దుర్మార్గములు సేయుచుండును. అతివాదినని విఱ్ఱవీగి, యక్రమసంఘములకు తోడ్పడి, యనేకవిధముల నకృత్యములు చేయుచుండును. దుర్మార్గులకు సచ్ఛీలమెక్కడ? తామనకు దయయుంచునా? ప్రజలు వీనిపై యాడంబరములకు భ్రమసి, వానిని పొగడుచుందురు. వివేకజ్ఞానపారణులగు మీరు న్యాయాన్యాయవిచక్షణమొనర్చి, తగురీతిని శిక్షింపఁగోరెదను.”

ఇట్లాతఁడుపన్యసించి కూర్చుండుటయు, గణేశుఁడు సహజవాగ్ధోరణితో ముచ్చటించునని ప్రేక్షకులువేచియుండిరి. అట్లు కగరుజ,

నూతనుఁడగు నొక యువకుఁడు లేచినిలువబడెను. అతఁడొక న్యాయవాదియని తెలియవచ్చెను. అతనిపేరు రవీంద్రనాథ సేను. అతనిని జూచినంతనే ప్రజలాశాభంగులై నిరుత్సాహము చెందిరి. కాని, యాతఁడు ప్రథమమున నెమ్మదిగ ప్రారంభించెను. క్రమక్రమముగ సవరోహణారోహణములతో గంభీరముగ నుపన్యసించెను. ఏమి వాగ్ధోరణి! ఏమి పదగుంభన? ఏమి కంఠమార్దవము! ఏమి యా తర్కశాస్త్రప్రావీణ్యము! అతఁడు మాటలాడు నంతకాలమును ప్రజలు పరవశులై వినుచుండిరి. అతఁడు,

"న్యాయాధీశా! సభాస్తారులారా!

సీతానాథరాయులంతటి న్యాయవాది యుపన్యసించిన పిమ్మట నావంటి బాలుఁడు, విద్యాలేశమెఱుంగనివాఁడుపన్యసింప సమకట్టుట మిగుల సాహసమని తోచవచ్చును. కాని, కార్యభారము నాపైనుండుటచేతను, మీరెల్లరును నా వాక్యములను సావధానచిత్తులరై విననోరెదను. నాతప్పులు మన్నించి నాకుత్సాహభంగ మొనర్పకుండ ప్రార్థితులు.

నేను నుదినము. న్యాయాన్యాయ వివేక ప్రావీణ్యుఁడగు న్యాయాధిపతి మనకు సంభవించెను. నింద్రితు నెఱుంగనివారు లేరు. అతి వాదియగుటచే నీతఁడు మితవాది పక్షమువారి నిందలకు లోనగుట సహజము. కాని, యాతనిని రాజకీయాభిప్రాయముల ననుసరించి, శిక్షించుట న్యాయము కాదు. నిందితుఁడనబరగు కమలాకరరాయలు, మర్యాదస్థులగు జమీందారుల కుటుంబమున జనన మొంది, విశ్వవిద్యాలయములో నగ్రగణ్యుఁడుగ నారితేరి, గురువుల మెప్పువడసి, పారితోషికములు గొన్నట్టి సన్మార్గవర్తి. సద్గుణమూర్తి. దయాశాలి, ధీరాగ్రేసరుఁడు. ప్రజానురంజకుఁడు. పెద్దలగువారియందు భక్తియు సూరులయందనురక్తియు, బందుగులయెడ ప్రేమయు, బీదలయెడ

కరుణయుగల మహనీయుఁడు. చిన్ననాటినుండియు నిచ్చటనే పెరిగి, పెద్దవాఁడై, గణుతిఁగాంచెను. అతనిమీఁదను కారణముగ ద్రోహచింతనము దుష్ప్రవర్తనము గృహదాహము, ధనప్రాణాపహరణోద్యమము నను యనిర్వాచ్యములగు నిందారోపణలు సేయబడెను. మత్తేభకుంభస్థిత మాంసగ్రహణోత్సాహపూరితయగు మృగరాజేడ? గడ్డిపరకలు తిన గోరుటేడ? కమలాకరుఁడేడ? హత్యయొనర్పనుద్దేశించుటేడ? ఇదంత యు కల్పన. అవివేకము. అసంబద్ధము. అసమంజసము. అన్యాయము. అసత్యము. అక్రమము. అసాధ్యము.

వాగ్రంగణపారీణులగు మీరు, కుతర్కములచే వంచింపఁబడక భీషణభాషణంబులచే భ్రమింపక, వాగాడంబరములచే వశీకృతులు గాక, యధికారధూర్వహులచే నదువనయింపబడక, నిజానిజములను, యుక్తాయుక్తములను, తప్పొప్పులను, విమర్శించి, మీయభిప్రాయములను నిర్భయముగ, నిశ్శంకగ, నిరాఘాటముగ, నిష్పాక్షికముగ, నిశ్చయముగ, నిష్కర్షగ నెఱింగింపవేఁడెద.

హిందువుఁడై, హైందవకులాచారానువర్తియై, హిందూ జాతిని ప్రేమించుచు, వర్తించునాతఁడేడ, దుశ్శీలురు, దుర్మార్గులు, దుష్కర్మనిరతులు, నొనర్పందగు కార్యములు సేయనుద్యమించుటేడ? ఇది యథార్థమగునా? అర్హమని యెంతురా? సుసాధ్యమని తలంతురా? ఒక జమీందారుఁడు, పితృసమానుఁడు, వృద్ధుఁడు, నగువాని నిష్కారణముగ, నిర్భయముగ, నిర్హేతుకముగ, హత్యసేయనుద్యమించునా? ఇది సహేతుకమా? సంభవనీయమా? సమంజసమా? సమాదరణీయమా? కల్ల; ముమ్మాటికిని కల్ల. విలువయగు మీ కాలమును వృథాగ పాడుసేయనొల్ల, అంతయు మీకు కరతలామలకమయ్యె. అధికముగ నుడువుట యనపేక్షణీయము, ఓగుబాగులు, లగ్గగ్గులు, విచారించి, మీమనమున కేదిసరియని తోచునో, నిశ్చయము

సేయుఁడు సత్పథముఁ జెలఁగుడు. సత్యమును గ్రహింపుఁడు; న్యాయంబ
సముగ నిర్ధారణసేయుఁడు; సద్యశము గొనుఁడు. సౌఖ్యములగనుఁడు.
సంపదలమనుఁడు. నానుఖులవినుఁడు." అని రవీంద్రుఁడు ఉపన్యాసము
ముగించికూర్చుండెను. ఇంతలో ఫలాహారముల వేళయగుటయు.
సభ చాలింపబడెను.

మరల మూడుగంటలకు రక్తాంబరములు ధరియించి, నల్లనిశి
రోవేష్టనములనుదాల్చి, న్యాయాధ్యక్షుఁడును, జ్యూరర్లును వచ్చి కూ
ర్చుండిరి. శేఖరియగు కరంచంద్ తీర్పును చదివి వినిపించెను. కమలా
కరుఁడు దోషియని నిశ్చయింపబడెను. అతఁడు రెండుసంవత్సరములు కఠి
నశిక్షననుభవింపవలయునని తీర్మానింపబడెను. అందరును విచారగ్రస్తు
లైరి. నాటి సాయంకాలము నిందితుఁడు కారాగారమునకు గొనిపో
బడెను"

ఇట్లు భారతవర్షమున ప్రచురింపఁబడినది ప్రజలెల్లరును ము
క్కు-లపై చేతులు వైచికొని విచారింపఁదొడఁగిరి—

## 11 వ ప్రకరణము.

ప్రజాభిప్రాయము.

కోర్టుముగింపబడెను. నిందితునిబంధుగులు నాటి రేయినిద్దుర
లేక గడపిరి. ఆనందవిచారములకు మేర లేకుండెను. రవీంద్రుఁడు కమ
లాకరుని బంధుజనముల నూరార్చుటకు ప్రయత్నింపుచుండెను. ముఖ
ర్జీసంతోషముచే నుప్పొంగెను. నిజసామర్థ్యముచే విజయుఁడనైతినని
యు, తనకు డిప్యూటీకలెక్టరో, యింకనే యితరమగు నధికారపదవి
యో, వేచియున్నదనియు, దొరతనమువారు తనకొక బిరుదమొసఁగి
లించితీరుదురనియు, సంతసించుచున్నను, తాను వలచినకన్నియను

లోనికేగగనే, కమలాకరుఁడాతని గాఁగిలించుకొని, కన్నులనశ్రుజలం
బులురాల్చుచు, "మిత్రుఁడా! నీశక్తివంచనలేక తగినంత చేసితివి. విధి
ప్రాతికూల్యము వహించినపుడు నీవేమిచేయఁగలవు? నాగౌరవము
తయు నశించినది. నిందారోపణగావింపఁబడినది. శిక్షితుఁడనగుటచే
నేనింక విముక్తి నొందినను, దేశాచారానుసారముగ నామోహాంపులత
సద్గుణఖనియగు నానందకు ద్రోహము కాజాలదుగదా? యశము"
మానము, స్వాతంత్ర్యము, కులగౌరవమునంతయు నశించిననాకామె
గోరుటకంటె మహాపాపము వేరున్నదా? ఇట్టి నీచునకింకేటిబ్రతుకు.
నిజముగ నాహితముగోరువాఁడవైనచో నాకాత్మహత్య కుపాయము
నాలోచింపుము. ఈలోకమున నిఁక మనజాల. మర్యాదను భరింప
జాల, కష్టములకోర్వజాల. నాబంధువులతో నన్ను లేనివానిఁగ నెం
చుకొమ్మని చెప్పుము. ఆనందతో నన్ను మరచి పొమ్మని చెప్పుము.
గణేశునకు కృతజ్ఞతాపూర్వకవందనములని చెప్పుము. నీ ఋణమును
తీర్చుకొనజాలను. నామిత్రులకెల్లరకును నాప్రణామముల దెలుపుము"
అని వాపోవఁదొడంగెను.

రవీంద్రుఁడింకను హతాశుఁడు గాలేదు. అతఁడు సహజము
లగు గంభీరభాషణములతో "కమలాకరా! ఏటికిట్లు భీరువవయెదవు?
ఈతీర్పు ఆఖరు కాదుగదా! ఇంకను ప్రధానన్యాయస్థాన మున్నది.
అదియునుగాక రాజేంద్రునకు దయ చూపుమని ప్రార్థింపనగును.
నేను తగినప్రయత్నములు చేసెదను. నా బొందెలో జీవ ముండగా
నిన్నిట్టి దురవస్థలోనుంచి పరిత్యజింతునా? ధైర్యము వహింపుము!
కష్టసుఖములు కావడికుండలు గదా! నేఁడు చీకటి; రేపు వెన్నెల;
నేఁడు బీద రేపుసాద యగుచుండునుగదా! కష్టములు వచ్చినపుడధైర్య
పడువాఁడు కాపురుషుఁడు! ఐశ్వర్యమునవిఱ్ఱవీగువాఁడధమాధముఁడు!
రెంటిని సమానముగ భరియించువాఁడే పురుషాగ్రేసరుఁడు. నిజముగ

ధర్మమే జయించునో, దైవమే యున్నచో, నీవు ప్రధానన్యాయ స్థానమున నభియోగములో తప్పక జయముగాంచి తీరెదవు. కావున విచారింపకుము. విచారించినచో నీవే నిందితుండ వని తలంతురు. కనుక, ధైర్యముతో నుండుము. కాని విచారింపకుము. నేను నీకై యెంత ప్రయత్నము చేసి తీరెదను. నేను కలకత్తాకు పోయి మరల నాలుగుదినములలో తిరిగివత్తును. అంతవఱకును ధైర్యము దిక్కుబట్టి యుండుము. ఒక పక్షములో నేదో మార్పు కలిగి తీరునను నమ్మకము నా కున్నది. వేరుగ తలంపకుము. నీవు నా సోదరునివంటివాడవు. నీకు సాయము చేయకున్నచో నాకీ విద్య యేల? ఈయుద్యోగ మేల? భయమొందకు" మని యూరడించెను.

కమలాకరుఁడు "సోదరా! నాకు ధైర్యము వదలలేదు గాని, నాకు బయటపడుదునను నమ్మకము లేదు. అయినను నీ వింతగా చెప్పినదానికి నేను కాదనను నీ మాటలను శిరసా వహించెదను. నా పై భారమంతయు నుంచియున్నాను. ఒకపక్షములో నీ దగ్గర నుండి వర్తమానము రాకుండినచో నింక నీకు కమలాకరుఁడు లేడని యెంచుము. నీకు శుభమగుగాక! పోయిరమ్ము!" అని దీనముగ నాతని వీడ్కొలిపి పంపెను. రవీంద్రుఁడును నాతని నాలింగనము చేసికొని ధైర్యము వహించియుండుమని ప్రోత్సహించి యింటికేగెను. ఇంతలో నాతనికడకు నవీనమోహనుఁడు డేతెంచి కమలాకరుని దశకై దుఃఖించి చేయవలసిన దేదియని ప్రశ్నించెను. రవీంద్రుఁ డనతికాలములో తెలియగలదనియు, నింకొక రంగస్వామిని పట్టుకొనుటకు ప్రయత్నములు సేయవలసినదనియు, చెప్పి వారందఱనుండి సెలవుగైకొని కలకత్తాకు పోయెను.

---

## 12 వ ప్రకరణము



### బుడబుక్కలవాఁడు.

తెల్లవారవచ్చుచుండెను. పక్షులు కిలకిలారావములు గావింపుచు, నాహారసంపాదనార్థమై బిడ్డలంబాసి, నిజకులాయములను వీడి, పయనమై పోవుచుండెను. రేరాజు కళావిహీనుఁ డయ్యెను. కలువలు ముకుళితము లగుచుండ, జాతివైరము పాటించి వైరులు నీచదశలో నున్నపుడు తా ముద్ధతులగునట్లు కమలములు వికసింపుచు సుగంధ సౌరభముల వెదజల్లుచుండెను. మందపవనుఁ డల్లనల్లన కందువుల వీచుచుండెను. కృషీవలులు భుజములపై నాగేళ్ళను ధరించి వ్యవసాయార్థమై యేగుచుండిరి. లేగలు పాలుపిదుకు వేళయగుటచే తల్లులం గాంచి యంబా యని యఱచుచుండెను. పురకాంతలెల్ల గృహముల ముందు రంగవల్లులచే నలంకరింపుచుండిరి. విప్రులు ప్రాతస్స్నానము లాచరించి సంధ్యావందనాది కార్యములు నిర్వర్తించి, గృహాభిముఖులై చనుచుండిరి. తూర్పుకొండపై సహస్రకిరణుఁడు సహజారుణకాంతుల ప్రసరింపుచు, లోకపరిపాలనోత్సాహియై బయలుదేరెను.

పాటలీపురిబాటంబట్టి యొక బుడబుక్కలవాఁడు "టురుర్రు" మని తనచిరుతను మ్రోయించుచు " నంబా! పలుకవే ! జగదంబా ! పలుకవే వాణి ! పలుకవే ! కీరవాణి! పలుకవే!" యనుచు, నిద్రాభంగము గావింపుచు, యాచించుచు పోవుచుండెను. వాని యాకారమునుబట్టి వాఁడు స్ఫురద్రూపివలె జోచుచుండెను. యువకుఁడు. నయనయుగ్మము తేజోవిరాజితంబై, బీదలయందును లక్షణలక్షితు లుండఁబోరని తోఁపజేయుచుండెను. వానిని జూచి కొందఱుబాలురు రేగ తాళిజేయుచుండిరి. నిద్రనుండి లేచిన పిల్లలు తల్లులం గౌఁగిలించుకొని యేడ్చుచుండిరి. లుబ్ధాగ్రేసరులు "నీకప్పుడే తెల్లవారినదా? అప్పుడే

ప్రారంభించినావు! నీచదువు వినువా రెవ్వరును లేరు. పో పో!" యని కసరి కొట్టుచుండిరి. విద్యాధికులమని విఱ్ఱవీగుచు, తొమ్మిది గంటలవఱకును పడకలనుండి లేవకుండెడి నవవయస్కులు కొందరు "నిద్రాభంగము గావించిన వీనిని రక్షకభటులు వారింపరేల? వారికింత జేమరిపాటా?" యని విసువుకొనుచుండిరి. అతఁ డిట్లొకటిరెండు గృహములలో బిచ్చమడిగి ధః పురేశుని గృహము సమీపించెను.

అంతకుపూర్వమే మనోరమ పడకటింటిని వీడి బైటకు వచ్చెను. ఆమెకు రెండుదినములక్రితము కమలాకరుఁడు చెఱసాలలో నుంచబడినవార్త యించుకవిచారముఁ గలుగజేసెను. తనకు ద్రోహియగు వాఁడు పరాభవము నొందెనని సంతసించినను, చిరకాలసంవర్ధిత ప్రేమాంకురము లామెను పూర్ణముగ విడువకుండుటచే విచారము గలెను. ఆమె కిట్లయిన వాతని భావిదశ యెట్లుండునో యని తెలిసికొనవలెనని యుండెను. అధునికులకు మూఢవిశ్వాసము లేకుండుటచే వారు సోదె చెప్పువారిని గర్హించినను, వారిలోనిప్పుడు విద్యాధికులే కొందరు జ్యోతిషమునందును, కేరళము, సాముద్రికాది శాస్త్రములయందును నమ్మకము చూపుచున్నారు. మనోరమకు సోదె చెప్పువారు, బుడబుక్కలవారు, ముష్కులవాండ్రు మొదలగువారి సామర్థ్యములయందు నమ్మకము కలదు. అందుచే నాతనివలన కమలాకరుని భావిదశ యెట్లుండునో తెలియఁగోరి వానిని లోనికి పిలువనంపెను.

భవిష్యద్వర్తమానములను చెప్పెదమని నటించువారందరును సర్వసాధారణముగ ప్రశ్నించువారి ముఖములందలి చిహ్నములను బట్టి ప్రారంభింతురు. అందు స్త్రీలు తలలు పంకించుచు, మోదఖేదములను వెలిబుచ్చుచు, తామె వారు చెప్పవలసిన సంగతులను సూచింతురు. అంత నాసంగతులనే చమత్కారభాషణములతో వారు తిరుగ చెప్పుచు, ప్రశంసలనంది, పారితోషికములను గొనుచుందురు.

నేటి ప్రాతఃకాల మీగ్రామమున ప్రవేశించిన బుడబుక్కలవాఁడు సామాన్యమానవునివలె దోచుటలేదు. మనోరమ నోరైన కదల్పకుండగనే సంగతినంతయు నేకరువుపెట్టి, మనోరమయభిప్రాయమును సూచించెను. ఆమె యాశ్చర్యముచే కంపించెను. ఆమె వానిమాటలన్నియు నిజమని సమ్మతించెను. అతఁడు మరునటిదినముసాయంకాలము పూజానంతరమున కమలాకరునకు జరుగబోవు సంగతులన్నియు జెప్పెదననియు, నయ్యవి నిర్జనమగు ప్రదేశమున చెప్పవలయుననియు నందులకామె నియమితకాలమునకు పూదోటకు విచ్చేయవలసినదనియు, కోరెను. ఆమె సమ్మతించెను. ఆమె సెలవు గైకొని యాతఁడు మెల్లమెల్లగ గృహంబులయొద్ద బిచ్చ మెత్తుకొనుచు, నవీనమోహనుని గృహము సమీపించెను. నవీనమోహనుఁ డిట్టి నమ్మకము లేనివాఁ డగుటచే సీతనిని బంపివేయుమని నౌకరు నంపెను. కాని, యాతఁడట్లు వెడలిపోక "బాబుగారిదర్శనము చేయవలె" నని పట్టుబట్టెను. అంత విసివికొనుచు మోహనుఁడు ప్రవేశించుటయు, నాబిచ్చగాఁ డాతని కేదో చిన్నకాగితమును చూపించెను. మోహనుఁడది గాంచినంతనే సేవకు నేదో పనిమీద నావలకు బంపివైచి "బిచ్చగాఁడా! అన్నము పెట్టింతును లోనికిర" మ్మనితీసికొనిపోయి, సత్కరించి, వాని కేదో కాగితమును వ్రాసి, రక్షకభటులెవరైన నిర్బంధపరచినచో చూపవలసినదనియు, వానిని వదలివేయుదురనియు చెప్పి వానికిచ్చి పంపివైచెను. బిచ్చగాఁడును వెడలిపోయెను.

---

## 13 వ ప్రకరణము

### ధనిష్ఠ

మనోరమకు కమలాకరుని వృత్తాంతము చెప్పుదు వినగల్గుదునా యను వాంఛ మెండయ్యెను. మరునాఁడు గంటలే యుగములుగ గడ

వెను. నిర్ణీతసమయమున కొకగంట ముందే యామె యుద్యానవనము నకు బయలుదేఱి పోయెను. కానిసమయములో నెట్లు బుడబుక్కల వాఁడు రాగలఁడు? ఆమె యట్లు తిరుగుచు, నేదో యాలోచించు కొనుచుండగా, నొక చెట్టును సమీపించు నప్పటికి బుడబుక్కల వాఁ డెదురయ్యెను. గుప్తముగ నుండుటకై వారొక పూవు టింటఁ బ్రవేశించిరి. మనోరమయు, వాని నాతురముతో "పూజ సమాప్తియైనదా? దేవి నీతో మాట్లాడినదా? ఏమి విశేషములు?" అని ప్రశ్నించెను. అతఁడు "తల్లీ! మీవంటివారు కోరుటయు మఱియా భగవతి చెప్పకుండుటయునా? నేటియుదయముననే దేవి నాకంతయు నెఱింగించినది. కాని, నేను భవిష్యత్పర్యవసానమును చెప్పుటకు పూర్వము మిమ్ము కొన్ని ప్రశ్న లడుగవలసియున్నది. వానికి సరియగు సమాధానము లిత్తురా?" యని యడిగెను. మనోరమ సమ్మతించెను.

బుడ—కమలాకరుఁడు నిజముగ ద్రోహియని మీరుతలంతురా!

మనో—కాదు.

బుడ—తారానాథుఁడు నిజము చెప్పెనా?

మనో—లేదు, అసత్యము చెప్పెను.

బుడ—మీకును కమలాకరునకును బూర్వము సంబంధ ముండలేదా?

మనో—(ఊరకుండెను; సిగ్గుపడెను.)

బుడ—ద్రోహి యెవ్వరైయుండును?

మనో—నాకు తెలియదు.

బుడ—తారానాథుఁడు నిజమెప్పటికైన చెప్పునా?

మనో—చెప్పఁడు—

బుడ—తల్లీ! సవిచారులునా. వినుము. కమలాకరుఁడు రక్షితుఁ డగును. అతనికి శైలప్రాప్తి గలదు. ఆనంద [illegible] పరిత్యజించు

ను. కాని, చివరకు దైవఘటనవలన వానికి బంధవిముక్తి కల్గును. ఇది నిజముకానిచో నే నీయూరనే భార్యాపుత్రాదులతో నున్నాను. నన్ను కొరతను వేయింపుడు.

మనో—సరియే. అతఁడెట్లయిననేమి? కాని, యేమిజరుగునో యని యడిగితిని. ఈసంగతి నెవరికిని జెప్పకుము. ఇదిగో నీకు బహుమతిగా పదియూపాయిలు. దీనితో సంతృప్తినొందుము. ఇది నిజమగుచో నీ కింకను బహుమతు లీయఁగలను. జాగ్రత్తగనుండుము.

బుడ—తల్లీ! భగవతిసాక్షిగ నెవ్వరితోఁడను చెప్పను. అట్లొనర్చినట్లు తెలిసినచో మీరాయిచ్చవచ్చినట్లు దండింపవచ్చును.

మనో—సరియే పొమ్ము! జాగ్రత్త!

బుడ—చిత్తము. సెలవు దయసేయుఁడు. పోయివత్తును. (నిష్క్రమించును.) మనోరమయు వెడలిపోయెను. ఆమె వెడలిపోయిన పిమ్మట నెవ్వరో ముగ్గురుమనుష్యులు చెట్టుదిగి, యెవరును చూడకుండగ నిశ్శబ్దముగ వెడలిపోయిరి. వారెవరు?—

---

## 14 వ ప్రకరణము.

### పిచ్చివాంఢ్రు.

పాటలీపుత్రమునందలి వైద్యశాలవిషయమై యిదివరలో కొంత ప్రసంగించి యుంటిమి. అందు శివసింగును భద్రముగ నుంచిరి. అతఁడన్నిపనులు చేయును గాని, పలుకరించిన పలుకఁడు. వానిని నయమున భయమున రమేశుఁడు, ముఖర్జీ మొదలగువారు మాట్లాడింపఁజూచిరి; గాని, కార్యము లేకపోయెను. వాఁ డెవ్వరితోఁడను పలుకఁడు; యెవ్వనిసాంగత్యమును కోరఁడు.

ఒకనాడు వీధులవెంబడి బిచ్చగాఁ డొకఁడు పోవుచుండెను. వానిని వెంబడించి కుక్కలు మొఱుగుచుండెను. పిల్లలు కేకలు వేయు

చుండిరి. వాఁడును వారిమీఁద రాళ్ళు రువ్వుచుండెను. వారు పారిపో వుచు మరలి వచ్చుచుండిరి. ఇట్లు కొంతదూరము పోయి వాఁడు పరుగులు గ్రిక్కుచు క్రిందపడి పొర్లాడుచుండెను. కొందఱు పోయి వానిముఖము పై చన్నీటిని చిలుకరించిరి. కొందఱు వానికి వేడిగంజిని త్రాగనిచ్చిరి. అతఁడు త్రాగఁడయ్యెను. కొందఱు పోయి డాక్టరు రమేశుని పిలువ నంపిరి. అతఁడు వచ్చి వానిని పరీక్షించుచుండెను. పిచ్చివాఁడు వానిని గట్టిగ బట్టుకొని గుంజివైచెను. తలను తలతోఁ కొర్చెను. గట్టిగా కౌఁగిలించి కఱువఁబోయెను. అంత రమేశుఁడు బలవంతముగ వాని నుండి విడిపించుకొని రక్షకభటులచే వైద్యశాలకు బంపివేసెను.

పిచ్చివానికి రమేశుఁడు మందుల నిచ్చుటకు ప్రయత్నించెను; కాని, వాఁడు మందుల నెల్ల పారఁబోసి యల్లరిచేయసాగెను. వానిని శివసింగున్నగదిలో వైచి, సంకెళ్ళు తగిలించి, తాళము వైచిరి. కొలఁదిదినము లైనపిమ్మట వాఁడు శివసింగుతో నేదో వెట్టిమాటలాడుచుండుట వారు చూచిరి.

---

## 15 వ ప్రకరణము

[illegible]

పుగజః మహాపథ

ఆనందమయి ప్రభృతులకు విచారము మెండయ్యెను. వారికేదియు తోఁచుటలేదు. జగత్కిశోరుఁడు పనితొందరలుండుటచే స్వగ్రామమునకుపోయెను. భవాని యిల్లువదలుటలేదు. వారినిచూచుటకు బంధుగులు వచ్చిరి. అందులో యానందపినతల్లికూతురు లావణ్యమయి యనులావణ్యమయి యొకర్తుండెను. ఆమె సౌందర్యమున కానందతో సరియగునని చెప్పవచ్చును; నవవయస్క. విద్యావతి. పట్టణములయందు వసించుచుండుటచే నవనాగరికురాలై, నగలు వాడెములు ధరింపక

జాకెట్లు, లాగాలు, పైటలు ధరింపుచు, నిరంతరమును నాటకములు నవలలు చదువుచు కాలము గడపుచుండును. ఆమెకాంగ్లవిద్యలో ప్రావీణ్యముండెను. ఆమె నూతనముగ నొకనవల రచియించుచుండె ననియు, సత్యాది భావగర్భితమై, పాత్రోచిత మొదలగు వానితో గూడి నగరమునకు శైలిలో వ్రాయబడుచున్నదని తెలియవచ్చెను. వచ్చినప్పటినుండియు నామెసోదరి నూరార్పుచుండెను.

ఇంక ముఖర్జీయవస్థ వర్ణనాతీతము. ఇదివరలో చెప్పినట్లాతఁడు చాలగర్వముతో విఱ్ఱవీగుచుండెను. అతనికంతయు నాహ్లాదకరమేగాని తనకు హానియును జరుగుట యసంభవమనియు విచారింపుచుండెను. అతఁడొక్కొకసారి తనవిధిని దూషింపుచుండును. ఒకనాఁడు నవీన మోహనుఁడు దాతనిఁజూడఁబోయెను. ప్రసంగవశమున నాతఁడాయూరిజనులు రవింపఁగినకు విందొనర్పబోవుచున్నారనియు, తమయసమ్మతిని తెలియబరచుచు పైయధికారులకు విచారణ తిరుగజరుపుటకు మహజరును పంపుటకు పురమందిరమున నొకసభ గావింపనున్నారనియు తెలియజేసెను.

ఆనాటిసాయంకాలము, పురమందిరమున నొకసభ గావింపఁబడెను. అందుప్రజలందరును ముఖర్జీగారు పట్టుదలతో పనిచేసి నిజమును గ్రహింపలేదనియు, శివసింగను మూర్ఖుఁడు నేరారోపణకు కారకుఁడనియు, ప్రాతనిసంగతియే కేసునందుగానుంచుటకు కారణము తెలియలేదనియు, మరల విచారించుట యత్యావశ్యకమనియు దొరతనమువారికొక విన్నపత్రముచు పంపుటకు తీర్మానించిరి. నిందితునికుటుంబమునకు తమసానుభూతిని తెలియజేయుచు నొకతీర్మానము గావింపఁబడెను.

ముఖర్జీ మొగము విన్నఁబోయెను. అతఁడు తానొనర్చిన తప్పులను గ్రహించెను. విచారణములో శివసింగును తప్పించుట ప్రమాదకరమైనసంగతియే. అది నిందార్హము. అది ఘనుఁడగు సీతానాథుఁడై

నను గ్రహింపలేదు. ఇంక చేయునదేమి? సీతానాథుడు తనకు బహుమానము గల్గినందులకు తనయుద్యోగమునకేమి కీడు దెచ్చునో? అతనికి చాల పలుకుబడికలదు గవర్నమెంటువారాతనిని చాల గౌరవింపుచుండిరి. తనకిక చేయదగిన కార్యము తోచుటలేదు. కలిగినవిజయము స్థిరము కాకుండెను. అతనివిచారము హెచ్చెను.

సురేంద్రుడు విచారముతో నింటనేయుండెను. ఇంతలో నిద్దరు పురుషులు రంగస్వామితో వచ్చిరి. రంగస్వామినిజూచి సురేంద్రుడు "ఈతడెక్కడదొరకినాడు. వచ్చుటకు సమ్మతించెనా?" యని ప్రశ్నించెను.

రంగస్వామి, "అయ్యా! నేనెచ్చటికినిపోలేదు. ఈయూరనేయున్నాను. వీరికిదొరుకవలెనని తలంచియే యిచటికి వచ్చితిని లేనిచో వీరికి నన్నుపట్టుకొనుట సాధ్యముకాదు. కమలాకరుడు నాకు మహోపకారము గావించెను నాకు దరిద్రవిచ్ఛిన్నమయ్యెను. అతనికి గుర్తరమగునవస్థ తటస్థించెను. కనుక వానినెట్లయిన నీయాపదనుండి తప్పింపదలచితిని. మేజస్ట్రీటును, సాక్షులను పిలువనంపుడు. వాఙ్మూలమిచ్చెదను" అని ప్రత్యుత్తరమిచ్చెను. మేయరును వానినికూర్చుండజేసి, రమేశునకును, ముఖర్జీకిని, నవీనునకును వర్తమానము పంపెను. భార్యతో నీవిషయము చెప్పుటకై లోపలికిపోయెను.

కొలదికాలములో డాక్టరును, మేజస్ట్రీటును, ఎటర్నీయు వచ్చేసిరి. కరంచంద్ తన లేఖినితోడను కాగితములతోడను వారివెంబడివచ్చెను. అంత రంగస్వామి యనవసరములగువిషయములను చెప్పక పూసగ్రుచ్చినట్లు కమలాకరుడొకనాడు రాత్రి బయటకుపోవుటద్దేశము తనకు తెలియజేయుటయు, నతనిమేలు పొందినవాడగుటచే తాను సమ్మతించి మాధవున కొంకలేకుండగనే బిలము కావించి వారిద్దరు

ను బయటకేగుటయు, కమలాకరుఁడు తనఖర్చులనిమిత్తమై తగినంతధనమిచ్చి యూరింబ్రవేశించుటయు, నాతఁడెచటికేగునో చూడఁదలంచి వానివెంబడించుటయు, మనోరమాసందర్శనమును వారిసంభాషణమును నొకరినొకరు దోషులని దూషించుకొనుటయు, నిరువురునునిర్దోషులనిగ్రహించుటయు, తారానాథునిప్రతిజ్ఞయు, కమలాకరుఁడు తన్ను గాల్చివేయుమని ప్రార్థించుటయు, తారానాథుఁడబద్ధపుసాక్ష్యమీయఁదలఁచుటయు, వానిమూర్ఖతయు, కమలాకరునిపలాయనమును విపులముగ జెప్పివైచెను. మేజస్ట్రీటు రంగస్వామిని "నీవెట్లు కనిపెట్టితివి?" అని ప్రశ్నించెను. అందులకాతఁడు తానొకశిలావిగ్రహముచాటున దాగుకొనుటయు, పిమ్మట గోడదగ్గరచేరి యంతయు వినుటయు, కమలాకరుఁడు మరల జైలునుచేరుటతోడనే తాను వెడలిపోవుటయు తెల్పెను. రమేశుఁడు కమలాకరుని విమోచనము నిశ్చయమని నమ్ముటచే సంతసించెను. నవీనుఁడు మోదమందెను. ముఖర్జీ యాశ్చర్యముచే కంపించెను. రంగస్వామిని కొంతకాల మచ్చటనేయుండవలసినదనియు నాతనికేయపాయమును వాటిల్లదనియు చెప్పి, నవీనమోహనుఁడు మిత్రులతో సంభాషింపుచుండెను. ఇంతలో రమేశుని మనోరమ పిలువనంపుటయు, నాతఁడు వారినివీడ్కొని వెడలిపోయెను. తక్కిన వారును భోజనములకై లేచిరి.

---

## 16 వ ప్రకరణము

### ఆనందత్యాగము

రమేశుఁడు మనోరమాగృహాభిముఖుఁడై పోవుచుండగా మార్గమధ్యమున ముసలిరాఘవుఁడెదురుపడుటయు, నాతనితో తారానాథుఁడు చావు బ్రతుకులలోనున్నాడనియు, తానాతనిని చూడబోవుచుంటి

ననియు, చెప్పెను. ముసలి రాఘవుఁడా వార్త యానందకెఱుకపరచెను. ఆనందకేదో యొక యూహ తట్టుటయు, తాను దీసికొని, ధనపురేశుని యింటికేగి, మనోరమతో మాట్లాడుటకై వేచియుంటిననియు, నొకపరి యీవలికి రావలసినదనియు కబురంపెను. పరిచారిక తారానాథుఁడు చాలదుస్థితియందుండుటచే మనోరమ రాజాలదని చెప్పెను. ఆనంద కోపముతో, "ఆమె వచ్చితీరవలెను. ప్రాణోపద్రవకరమగు పని. రాకున్నచో నేనె పోయి యామె పతి సముఖమునందే మాట్లాడెదనని చెప్పెను. పరిచారికయు భయముతో లోనికి పరుగెత్తిపోయి మనోరమకీసంగతియంతయు చెప్పెను. మనోరమ యెట్టకేలకు నీవలకువచ్చి, యానందతో,

"వానితో నేదియో మాట్లాడుటకోరితివట?" యని ప్రశ్నించెను.

ఆనంద — అవును,

మనో — ఏమది?

ఆనం — మీ పతి మరణింపనున్నాఁడు గదా?

మనో — అయిన నేమి?

ఆనం — కమలాకరుని కిప్పటికైన క్షమింపరాదా?

మనో — ఎట్లు?

ఆనం — నిజము నెఱుఁగఁబల్కి.

మనో — అట్లెన్నటికిఁ జరుగదు నా యవమానమునంతయు వానికర్పించితిని. నా పతినైన విడచుటకియ్యకొంటిని. అతఁడు నన్ను త్యజించెను. నేనాతనిపై నెట్లయిన పగసాధించుకొనెదను.

ఆనం — ఇది న్యాయమా? మీ కేమి లాభము? నన్ను జూచియైన విడువరాదా?

మనో — ఏటి వెఱ్ఱి. నేను సౌఖ్యము లేక, సర్వము గోల్పడి, యవమానకరమగు బ్రదుకు బ్రదుకుచుండగా, నాయాసము నరుహా

రించి, వానితో సనేకబాసలాడి, నమ్మించి, ద్రోహముచేసి, నాకిహపర సౌఖ్యములురెండును దూరమగునట్లొనర్చి నీతోసుఖించుచుండగా, నే నెట్లు సహింతును! నానాథుఁడు భ్రాంతి కారణమున నొనర్చెను. అది త్రిప్పి వేయుట నాకువీలా?

ఆనం—అట్లనకుము నీవు చెప్పినచో నీనాథుఁడేదియైన చేసి తీరును. అట్లు కానిచో నాతెగురువున్నైన బ్రవేశింపనిమ్ము. అతఁడు ఏ గురీతిని బోధించి వానిమనస్సు త్రిప్పివేయఁగలను.

మనో—అట్లుచేయనొల్లను. అట్లొనర్చినచో నాకపకీర్తియు గల్గుట తప్ప నేమిలాభము? అతఁడు నన్నింక చూడనైనచూడఁడు గదా?

ఆనం—నీనాతనిని పరిణయమగుదునని కదా, నీవు నిజము చెప్పుట కియ్యకొనకుండుట? నీనాతనిని విడచివేయుదును. నీనాతనిని నీకై విడచి విరాగిణినయ్యెదను. నీవు వానితో సుఖింపుము. నిరపరాధిని దండనకు పాల్పడునట్లు చేయకుము.

మనో—(చకితురాలై) ఏమీ? ఎంతదానవు? ఎంత సాహసము! ఏమినీశీలము! నాకొఱకై నీవు నీమనోనాథుని వర్జించి బైరాగివయ్యెదవా? ఈ యుక్తి నీకెవరు నేర్పిరి? రవీంద్రుఁడా? నే నట్లే తలంచితిని.

ఆనం—నాకెవ్వరును చెప్పలేదు. నాకే తోఁచినది; సమయము మించిన నేదియు చేయఁజాలముగదా? నీకుదయపుట్టినచో నెట్లుయీన కమలాకరునిపై నిందారోపణను తొలఁగింతువని యిచటికి వచ్చితిని.

మనో—ఆహా! నీవాక్యములు శూలములవలె నాటినవి కదా! చిన్నవయస్కురాలవగు నీవే యింతటి త్యాగమొనర్చుచో, వయసు చెల్లిన నా కాతనిపొత్తేల? నీపైవలపుగల్గినవాఁడు నన్నెట్లు ప్రేమించును? అదియసంభవము. ఇఁక నీనాతని నాకొఱకు విడనవసరము లేదు. నేనయ్యాతనికొఱకై నా గౌరవమునకైన సమ్మతించెదను. నాకుచేతనై

నంతసాయము చేసెదను. దైవసాక్షిగ నింక నేనీతుచ్ఛపువర్తనమును, హేయమగుజీవనమును గోరను. ఇంక నీవు చిరకాలము వర్ధిల్లుము. నేటితో నాకు నీమూలమునుగ జ్ఞాననేత్రము విడినది. ఇప్పటినుండియు నేను మోగించినసమ్మోదను. ఇహమునందిక నేదియుఁగోరను. పరలోకమునందైన నాకొంతి సౌఖ్యముగల్గుగాక. నేటి సాయంకాలము నీవు మరల నేసంగతియు వినగలవు. నాపెనిమిటి మరణావస్థలోనున్నాఁడు. ఆనందా! నాకింక సెలవిమ్ము. దీర్ఘసుమంగలివికమ్ము" అని దీవించి, పిమ్మటని యానందను బంపి మనోరమ భర్తృసన్నిధానమునకేగెను ఆనందయు నపారమగు నానందమొంది, తన పవిత్రవర్తనమునకును, మనోరమమనసునందలి మార్పునకు నచ్చెరువందుచు, తాతనుఁగలసికొని, జరిగినదంతయు చెప్పుచు, గృహము చేరి, యాశుభవార్త నాదలతునెఱింగించెను.

---

## 17 వ ప్రకరణము.

❦ ❦ ❦

### సీతా స్వగణము.

కమలాకరుఁడు మనోరమతో రత్నవిలాసమునందు నివసించు కాలమున సీతయను నాంధ్రవనిత పరిచారికగనుండెనని యిదివరలో చెప్పియుంటిమిగదా? ఆమె నన్వేషించుటకై రవీంద్రుఁడు కరీమును బంపియుండెను. అతఁడు రాజమహేంద్రవరమున కేగెను. అచట నామె బంధువులవలనగా నామె గుంటూరునందొక సంపన్నగృహస్థునింట కొలువునకు కుదిరెనని తెలిసెను. కరీమచ్చటికిపోయి సీతను కలసికొని మాట్లాడెను, సీత తనకు చేతనైనంత యుపకారము చేయుదుననియు, తన్ను దారిద్ర్యభారమునుండి తప్పించుటకొక వేయిరూప్యముల నియ్యవలసినదనియు, తన యజమానుని యనుమతిని గొనవలసినదనియు చె

ప్పెను. అట్లు యజమానుని యనుజ్ఞవడసి, పాటలీపుత్రము విచ్చేసి, మొకసత్రమునందు విడిసెను. కరీమ్ రవీంద్రునికై వెదకెనుగాని, యాతనిజాడను తెలుపువారు లేరైరి. అతఁడంత నవీనమోహనునకు సీతదొరికెననియు, సాక్ష్యమిచ్చుటకంగీకరించెననియు, నామె కొలువులో నున్నందున నింతకన్న త్వరంగావచ్చుటకు వీలుకా లేదనియు, నింతలోన కమలాకరుఁడు శిక్షితుఁడగుట విచారకరమనియు, తెల్పెను. మోహనుఁడును సీతను సాయంకాలము తన యింటికి తీసికొని రావలసినదని చెప్పి, మేజస్ట్రేటునకును యేతత్సమయమునకు రావలసినదని కబురంపెను.

నవీనుఁడు చాల జాగ్రత్త కలవాఁడు. అతఁడు నమ్మకముగల్గుటకుగాను, సీతను చూచుటకు మాధ్యాహ్నము పోవుచు, తనతో కొన్ని ఛాయాపటములను తీసికొని పోయెను. సీత సరిగ చెప్పగలదో లేదో యరయుటకై సీతకడకేగి, యామెను ముందుగ ప్రశ్నించి, సదుత్తరములు బడసెను. పిమ్మట ఛాయాపటములలో మనోరమపటమును గుర్తింపఁజేసెను. పిమ్మట సంతసించి, యీమాటలే మాజస్ట్రేటు ముందు చెప్పవలసినదని బోధించి యింటికేగెను.

సాయంకాలము మేయరు, ఎటర్నీ, మాజస్ట్రేటు, డాక్టరును నలువురును కొలువు దీర్చియుండిరి. సీతవచ్చెను. ఆమె వాఙ్మూలము నీరీతిగా నిచ్చెను.

"నేను నాల్గువత్సరములు రమావిలాసమున పనిచేసితిని. యుద్ధకారణమున పని మూసివేయవలసి వచ్చెను. నేను కొలువు కుదిరినదినముననే, మొవరో యిరువురు ప్రేమార్థులు,అక్రమముగు సమావేశమగుచుండుదురనియు, వారికి సేవచేయవలసియుండుననియు, కొన్ని కట్టుబాట్లకు లోనుగావలసి యుండుననియు తెలిసెను నాకు మొదట నాకొలువు మనస్కరింపకుండెను.

కాని యది చాలయనుకూలముగ నుండుటచేత నందే యుంటిని. నాకు ధనము నాహారమును వలయునంత లభించుచుండెను ఇంక పనియున్ననో చాలతక్కువ. అందుచే చాలదినము లందే యుంటిని. కాని మాయజమానులు నన్ను నమ్ముటలేదనియు, వారిరువురును కలసియున్నపుడు నన్నెదో పనిమీద నావలకు పంపివేయుచుండిరనియు, గ్రహించి, వారినిజస్థితిం గనుగొనుటకై ప్రయత్నింపవలెనని నిశ్చయము చేసికొంటిని. ఇట్లొక వారము గడచునప్పటికి నా యజమానుని సరియగు పేరు కమలాకరరాయలనియు, ధర్మపురీశుని పుత్రుండనియు తెలిసెను. ఇంక నాతని భార్య నామమును తెలిసికొనుటకై ప్రయత్నించితిని. ఒకనాడు వారు నన్నెదో పనిమీద నావలకు బంపివైచిరి. నేను పోయినట్లు నటించి, సమీపముననే పొంచియుండి, వారు వెడలి పోవుచుండగా వారి వెనుకనే పోవుచుంటిని. అతఁడొక భవనము సమీపించెను.

నేనాయింటివారి పరిచారికతో స్నేహము చేసి, యామెవివయమై ప్రశ్నించగా నామె సంపన్నయగు నొక జమీందారిణియనియు పేరు మనోరమయనియు, తెలియజేసెను, నేనొక దినంబున వారియింటికి పోయి యామెను జూచితిని. వలయునన్న నేనామె ఛాయాపటమును పోల్చుకొనగలను."

ఆమెకు కొన్ని ఛాయాపటముల నీయగా నందులో మనోరమపటము నామె వేరుగా తీసి చూపెను. ముఖర్జీ యాశ్చర్యమునకు మేర లేకుండెను. ఇంక నాతని కంతయు భంగమయ్యెననియు, తానింక యుద్యోగమున కణగిపోవుట తప్పదనియు, తలంచెను. ఇంతలోన వైద్యశాల నౌకరొకండరుదెంచి శివసింగును గుఱించి వర్తమానము తెలిసెననియు, వారుముగ్గురును తత్క్షణమే రావలసినదనియు కోరెను. వారందరు నచటికి పోయిరి.

---

## 18 వ ప్రకరణము.

శివసింగు గృహమున్న ప్రకటనము.

అధ కాంచతుష్టయమును పిచ్చివాఁడు వసించు గదిసమీపమున దాఁగి యుండిరి. వారికిని పిచ్చివానికిని మధ్య నొక ద్వారముండెను. దానికావలిభాగమున క్రొత్తగా వచ్చిన పిచ్చివాఁడును, శివసింగును కలసి భోజనమునకై కూర్చుండిరి.

గానరస మద్భుతప్రభావముగలది. దానిమహిమ వర్ణనాతీతము. కవివర్యులెల్లరును దానివర్ణనమును తమపొత్తములందు సంపించిరి. నారదాదిమహామునులును, వాల్మీకి మొదలగు కవివర్యులును దానికి సేవకులైరి. పసిబిడ్డలు, పాములు, వృద్ధులు, ఉన్మత్తులు, ఎల్లరును, గానరసముచే వశీకృతులు కాని వారు లేరు. గానరసమాధుర్యమును గ్రహింపఁజాలని వాఁడు పాషాణముకన్న నధముఁడని పాశ్చాత్యనాటకరచనాపాండిత్యప్రభావముచే నధికయశముఁ గాంచిన షేక్స్పియరు వర్ణించి యున్నాఁడు. "కూనిరాగము తీయని మగవాఁడును, కుడుములు వండఁజాలనియాఁడుదియు లేర"ని, జనసామాన్యమునం దొక సామెతకలదు. గానము ఖేదము, మోదము, సుఖము, దుఃఖము, అన్నిరసములను గలుగఁజేయును.

నేర్పరియగు గాయకుఁడు శ్రావ్యముగ పాడుచుండినచో సాధారణముగ మనసు లీనమైపోవును. నేఁడు శివసింగట్టియవస్థయం దుండెను. పిచ్చివాఁడు దిలారుబను గైకొని రాగమాల నాలాపింపఁ దొడంగెను. మొదట నానందముత్పాదించు నానందభైరవియు, పిమ్మట హంసధ్వని ననుకరించు హంసధ్వనియు, నాట్యము సలుపఁ జేయు నాటకురంజియు, సృష్టియంతయు మలయమారుతముచే వించునట్లు మలయమారుతమును క్రమక్రమముగ నారోహణావరోహణ

ములతో పాడసాగెను. వాని యవ్యక్తమధురగానము శివసింగు నున్మత్తుని జేసివైచెను. అతఁడు ప్రేలుట ప్రారంభించెను. వాని సంభాషణ యధికమగుటకు సహచారియగు పిచ్చివాఁడు వానికి మధుపానమిచ్చెను.

శివసింగు స్వర్గలోకమును చూరగొనుము, మిత్రుని ప్రశంసింపుము, పాడుమని నిర్బంధ పెట్టసాగెను. అంత వారికి క్రింది సంభాషణము నడచెను.

శివసింగు—చాల కాలముగ నున్నది. ఇంకను పాడుము.

పిచ్చివాఁడు మరల చితారు మ్రోయించెను. శివసింగు మరల త్రాగుటకు సారాయి నీయుమని యడిగెను.

రెండవవాడు—ఇటువంటిదిదివరలో నెప్పుడైన త్రాగితివా?

శివ—ఆహా! ఆనందభవనములో.

రెండ—కావలసినంత దొరకెడిదా?

శివ—ఆ! కావలసినంత. నేను సారాయమ్ము కొట్టులోనికి దొంగతనముగ పోయి త్రాగేవాడను.

రెండ—పాపము! నీకు విచారముగ నున్నది. అచటనుండినచో బాగుగ త్రాగెడివాఁడవు కదా?

శివ—అగును.

రెండ—అట్లయిన నెందుకు నిప్పంటించితివి?

శివ—కొన్ని చిక్కులను కల్పవలెననుకొంటిని. కాని యిల్లంతయు నంటుకొనెను. నేనేమి చేయుదును?

రెండు—జమీందారు నెందులకు కాల్చితివి?

శివ—మనోరమ కమలాకరుని పెండ్లి యాడుటకు.

రెండు—ఆమె నీతో నట్లు చేయుమని చెప్పినదా?

శివ—లేదు. కాని, యీమె చాలగ నేడ్చుచు, కమలాకరుని
తో నా పెనిమిటి లేకుండినచో నిన్ను పెండ్లి యాడి యుందును గదా
యనికల్లెను. అందుచేత నాకు మగనిని చంపినచో నాకు పెండ్లి
యాడునని తలంచితిని.

రెండ—కమలాకరుడు కాల్చెనని యెందుకు చెప్పినావు?

శివ—వారందరు నేను చేసితినని చెప్పినారు. జయిలులో
వేయుదురనుభయముచే నట్లు చెప్పినాను.

ఇంతలో వానికి భయముచే దేహము కంపించెను. రెండవ
వాడు మరల గానముచే వానిని సేదదేర్చెను. మరల శివసింగు స్వస్థుడ
య్యెను.

రెండవవాడు—నీకు తుపాకి యెక్కడ దొరికెను?

శివ—అది పిట్టలు కొట్టుటకు వారినడిగి పుచ్చుకొంటిని.
అది నాదగ్గరనే ఉన్నది. నేను దాగుకొన్న బొరియలో నున్నది.
సుబ్బుసింగు బలవంతముగా నన్ను లాగుకొని వచ్చినాడు. లేకున్న
చో వానిని చంపివేసి యుందును.

ఇది వినుటతోడనే రమేశునకు కోపము పట్టజాలక పోయెను.
తలుపు తీసికొని "భళిరా! రవీంద్రా!" యనియరచెను. శివసింగు
భయపడెను. జరిగినదంతయు గ్రహించెను. "హా! దుర్మార్గుడా"
యనియరచి, రవీంద్రుని భోజనము చేయుచాకుతో రెండుపోట్లు
పొడిచెను. రవీంద్రుడు వానినుండి తప్పించుకొనలేక పోయెను.
ఇంతలో వైద్యశాలలో నుండి యందరును పరుగెత్తి వచ్చిరి. శివ
సింగును భయంకరముగ నరచుచు గోడకు వీపునుజేర్చి, కత్తితో
వచ్చువారిని పొడువ నుంకించుచుండెను. ఇరువురు భటులు వారి వెను
కనుండి గోడనెక్కి "ఉరి" పోసి, చేతులను కట్టివైచిరి. శివసింగు
భయముచే మూర్ఛిల్లెను. వానినెంతో కష్టముపై సేదదేర్చిరి

అనేక ప్రశ్నలు వైచిరి. కాని, అతఁడు "నేను చెప్పను. మీ యిష్టము వచ్చినట్లు చేసికొనుఁడు" అని యెంతచెప్పినను మాటాడఁడు. వానిని చెఱసాలలో పెట్టిరి. రవీంద్రుని గాయమునుండి రక్తము స్రవించుచుండెను. రమేశుఁడాతని గాయములకు కట్లుకట్టెను. దెబ్బ బలముగా తగులకుండుటచే నపాయము కలుగలేదు "ఛీ ఎంతకష్టము. ఇటువంటి ఛండాలప్రవృత్తి చేయరాదు. అపరాధులను కట్టుకొనుట ప్రాణోపద్రవకరము" అని రవీంద్రుఁడు పల్కెను.

"నీవంటివారు లేకున్నచో, నేరములు బెట్టఁబడుటయెట్లు? నీకీర్తి దశదిశల వ్యాపించుగాక" యని సురేంద్రుఁడు దీవించెను.

---

## 19వ ప్రకరణము.

### పశ్చాత్తాపము.

మనోరమ యానందనువీడి మగనిం జేరఁబోయెను. అతఁడు మరణావస్థలోనుండెను. అతనిం జేరి మనోరమ "ప్రియా! మతిగురువును రప్పింతునా?" యని యడిగెను.

మనో.—అవసరములేదు. ఇంక నాదుర్మార్గుని రక్షింపదలచుకొనలేదు. నాకు ద్రోహముచేసెను. వానికి శిక్షవేయించితిని. అది పాపమయినను విచారింపను. తప్పక నాతఁడు శిక్షపొందవలయును.

మనో.—ప్రియా! అది యాతని తప్పుకాదు. అంతయు నాయది. నన్ను చంపి పగదీర్చుకొనుఁడు. నసింక విరాగిణి జీవనము తక్కయింతరము నపేక్షింపను. నాకీప్రపంచిక సౌఖ్యములపై నిచ్ఛలేదు.

తారా.—ఓసీ! దుర్మార్గురాలా! నిన్నంతగ ప్రేమించియుంటినే? నాసుఖమునకు మూలమనియు, నాయాశాలతకు తల్లివేరనియు, నా యుపాధరములకు సోపానమనియు, నిరోడదే గోకముపయు నెంచి

తివి. నావలపునకు తగిన ప్రతీకారము నిచ్చితివి. ఛీ ! నీచకులజల వలె ప్రవర్తించి, యకళంకితమగు మావంశమునకు కళంకము దెచ్చితివి. నీవు నిజముగ నెంత శిక్షకైన తగినదానవు. మీజాతిని నమ్మరాదు. స్త్రీ లింతటి హేయకరమగు వారింకొక రుండరు. స్త్రీలను నమ్మి యెందరు చెడిపోవలేదు. అయ్యో! ఇహమందు నిమూలమునను, పరమందు స్వకార్యమువలనను, పాప మనుభవింపవలసి వచ్చెను. నిర్దోషియైనను, కమలాకరుడు నిన్ను పెడమార్గముల బ్రవేశపెట్టెనని తలంచి, కోపముచే నాతని నకారణముగ చెఱసాల పాలు గావించితిని. హా ! దైవమా ! నాకు మరణావస్థలోనైన సుఖము గలుగదుకదా ! నేనేమి చేయుదును? కులటయగు దుర్మార్గురాలు నన్నిట్టి పాపమునకు పాలు గావించెను. నేను పశ్చాత్తాపతప్తుడనైతిని. ఛీ! స్వైరిణీ! ఎంతపాపమున కొడిగట్టితివే? సత్వరముగ మతగురువున కబెట్టుము. రమేశునకు వర్తమానము చేయుము. నీరెండవ కుమార్తెయు చావనున్నది. ఆమెను నే నధికగారాబముతో చూచుచుంటిని. కాని నాకామె జనియింపలేదనుట తథ్యమయ్యె. ఇక నామె ముఖమును చూడనొల్ల; పొమ్ము. శీఘ్రముగ వారలను పిలిచే మనుష్యులను పంపుము”

మనోరమయు నధికమగు విచారముతో నట్లొనర్చెను.

రమేశుడును మతగురువును ప్రవేశించిరి. తారానాధుడు వారలనమక్షమున తన యవసానకాలమున నీక్రింది విధముగ లిఖిత పూర్వకమగు మరణశాసనము వ్రాసి యిచ్చెను.

“ప్రజానమూహము నుద్దేశించి, ప్రణామపూర్వకముగ, పశ్చాత్తాపతప్తుడగు ధనపురము జమీందారు తారానాధరాయలు, వ్రాసిన మరణశాసనము.

నాభార్య నచ్ఛీలయనియు, నాకు మనఃపూర్వకముగ గొల్పు

కల్పియనియు నన్నీ కమలాకరుఁడే ద్రోహమునకు కారణమని తలంచి వానిపై నపవాదుమోపి నాపగదిప్పుకొన దలంచితిని. నిజము బైట పడెను. అతఁడు నిర్దోషి. న్యాయాధికారులు కమలాకరుని చెఱనుండి విముక్తి గలుగ జేయుదురుగాక ! ఇది మనఃపూర్వకముగ వాంఛించు చున్నాను. వానికి నాయాశీర్వచనములు.

తారానాధరాయ్.

ధనపురము జమీందార్ —"

అనతికాలములో స్వస్థచిత్తుఁడై తారానాధుడు పరలోకప్రాప్తి చెందెను. రమేశుఁడీశుభవర్తమానము నానందునకు తెలుపనేగెను.

---

## 20 వ ప్రకరణము.

### శృంగభంగము

పురజనుల తీర్మానము ప్రధానన్యాయస్థానము వారికి చేరెను. వారు ప్రజోద్దేశము ననుసరించి, కమలాకరుని నేరము మరల విచారింపవలసినదని మహేంద్రచంద్రరాయలున కుత్తరువిచ్చిరి. మహేంద్రుఁడు సంతోషముతో నాపనికియ్యకొనెను. అతని కిదివరలో తిరు కాదనితోచెను. దానికితోడు జరిగిన పొరపాటునకు ముఖర్జీ చింతించుటయు, సీతానాధుఁడు మహేంద్రునితో నాతనిపై ప్రతికూలముగ మాట్లాడుటయు, ముఖర్జీ నెట్లయిన పదచ్యుతుని గావింప నాతఁడు దృఢనిశ్చయుఁడై యుండుటయు, ముఖర్జీకి గర్వభంగము గలుగుట తప్పదని యాతఁడు విచారింపుచుండుటయు, తనయుద్దేశమునకు కొంత బలకరణములగు పురజనుల యభిప్రాయములననుసరించి మహేంద్రుఁడు మరల విచారణచేయుటకు నిశ్చయించెను. జనులందరును సంతసింపుచు పలువిధముల చెప్పుచుండిరి.

కమలాకరుఁడు కోర్టునకు తీసికొని రాబడెను. ప్రముఖులెల్లరును సాక్ష్యములిచ్చిరి. సీతానాథుఁడును, గణేశుఁడును, ముఖర్జీయు ప్రత్యక్షముగ, బుడబుక్కల వాని వేషము ధరించి, రవీంద్రుఁడు మనోరమతో సంభాషించిన దంతయు వినియుండిరి. వారివాఙ్మూలములు గైకొనబడెను. పాఠకమహాశయులకు సీతానాథుసంతటివాఁడు ప్రచ్ఛన్నముగ చెట్టునెక్కి వారి సంభాషణ నాలించుట యసంభవమని తోచవచ్చును. కాని రవీంద్రునంతటివాఁడు నిజము బైటబెట్టఁబూనుకొని నప్పుడు, సీతానాథుఁడియ్యకొన కుండునెట్లు?

సీతయు, మనోరమ పరిచారికయు, రంగస్వామియు సాక్ష్యములిచ్చిరి. రవీంద్రుని నెల్లరు నగ్గడించిరి. సబ్బుబిళ్లను నోటియందిడుకొని నురుగులుగ్రక్కి, పిచ్చివానివలె నటించి, బుడబుక్కలవాని వేషము దాల్చి, నేరమును బైటకీడ్చిన వాని చాకచక్యమునకు రవీంద్రుని ప్రశంసింపనివారు లేరు.

కమలాకరుని నిర్దోషిత్వము స్థాపింపబడెను. ఆనంద యాతనిని చెట్టబట్టెను. ఆనంద యానందమునకు మేర లేకుండెను.

మనోరమ శాంతికేతనమును స్థాపించి కీర్తిగాంచెను.

మాధవుఁడు తన యుద్యోగమును గావించి, వర్తకమును ప్రారంభించి ధన్యుఁడయ్యెను. ముఖర్జీ తప్పులను క్షమించి కమలాకరాదు లాతనిని తమమిత్రవర్గములో చేర్చుకొనిరి. కమలిని ముఖర్జీని పరిణయ మయ్యెను.

మనోరమ పినతల్లి కుమార్తెయగు లావణ్య రవీంద్రు నుద్వాహమయ్యెను. తక్కినవారెల్లరును ఋజుమార్గవర్తనులై సుఖించిరి.

రవీంద్రుని యపరాధపరిశోధక కార్యము లనేకములు గలవు. వానిని పాఠకమహాశయు లాదరింతురేని క్రమక్రమముగ సమర్పించుకొందును.

సంపూర్ణము.

